# విషయసూచిక



ముఖచిత్రం :

జాగృత ఆఫ్రికా (మా. నైజీరియా నవలా సంగ్రహం)

**అభ్యుదయ**

ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం మద్రాసు శాఖ మాస పత్రిక

సంచిక 12, సంపుటి 2 డిసెంబరు 1978 సాలు చందా రూ. 10

# జీవన గతి

ఏ. సూర్యప్రకాశ్

సమ్మె, దొమ్మీ, ధర్నా, ఘెరావో
టియర్ గ్యాస్, లాఠీ చార్జ్,
బుల్లెట్స్, ఫైరింగ్స్
అంబులెన్స్, కోర్ట్స్, జైల్స్
హత్యలు, భ్రూణ హత్యలు,
ఆత్మ హత్యలు, అంతరాత్మ హత్యలు
రేగింగ్స్, రేప్స్, రైడింగ్స్
అలజడి వాన నీటి అలలు
ఎటు విన్నా అసంతృప్తి
ఎటు చూసినా అశాంతి

ఎన్ని ఆశల ఇంద్రధనుస్సుల్ని
చూపారు!
ఎన్ని కేలెండర్లు మారినా
ఎన్ని జెండాలు మారినా
ఎన్ని డైరీలు మారినా
ఎన్ని ఎన్నికల మేనిఫెస్టోలు మారినా
ఎన్ని ప్రణాళికలు మారినా
సగటు మనిషి స్థితి మారదు
జన జీవన గతి మారదు!

# మహత్

నందిని సిధారెడ్డి

అక్షరాలే కావొచ్చు —
నా పెదవుల విల్లు మీద
సంధించి వదుల్తున్నప్పుడు
తలలో పూల జల్లులయ్యే
తలలో శూలాలయ్యే
బాణాలవుతాయ్!

అక్షరాలే కావచ్చు
నా పెదవుల అడివిలో జన్మించి
వీస్తున్నప్పుడు
నేత్రాల్లో తుఫాన్లు విసిరే
నేత్రాల్లో ప్రాణవాయువులు పులిమే
గాలు లవుతాయ్!
అక్షరాలే కావొచ్చు —
నా పెదవుల కేంద్రం మీద
విచ్ఛిత్తి అయి ప్రవహిస్తున్నపుడు
గుండెల్లో మంటలుగా రూపరే
గుండెల్లో బల్బులుగా మారే
విద్యుత్తు లవుతాయ్!

# రెండు రాజకీయోద్యమ నవలలు

'శ్రీ విరించి'

సమకాలీన జీవితాన్ని ప్రతిబింబిస్తూ, దేశంలోని రాజకీయ పరిస్థితులు యువతరాన్ని ఎలా ప్రభావితం చేస్తున్నాయో వివరిస్తూ తెలుగులో వచ్చిన నవలలు బహు తక్కువ. ఆ మాటకువస్తే భారతీయ భాషలలోనే తక్కువ. మానవ సమాజం ప్రతిక్షణమూ మారుతూ వుంటుంది. మార్పు 'జీవ లక్షణం'. అయితే ఈ మార్పు యెలా 'సంభవం' అయిందీ, జీవితాలను, దేశ చరిత్రను ఎలా మార్చివేసిందీ పరిశీలించి 'నవల'గా వ్రాయడం, కష్టంతో కూడుకున్న పని, గనుకనే ఎక్కువ మంది యీ ప్రయత్నానికి పూనుకోవడం లేదేమో అనిపిస్తుంది. మార్పు, పరిణామం అనేవి ఒక్క క్షణంలో ఊడిపడవు. వాటి అంతట అవే యేర్పడవు. కొందరు వ్యక్తులు తమ ఆలోచనా విధానాలలోనూ, జీవన సరళిలోను సరికొత్త పద్ధతులు ప్రవేశ పెట్టుకుంటారు; వాటి మంచితనాన్ని గురించి ప్రజలలో ప్రచారం చేస్తారు. ఒక రకంగా సమాజంలో రావలసిన మార్పుకు నాందీవాక్యం పలుకుతారు; ఆ పరిణామం రావడం కోసరం తమ జీవితాలను 'పణం'గా పెడతారు. మన దేశంలో అనేక జాతీయ ఉద్యమాలు వచ్చాయి. జాతీయ ఉద్యమం అంటూ ఒకటి పుట్టటానికి దేశంలోని 'కాలమాన పరిస్థితులు', ప్రజల 'నీరస నిర్జీవాలు' కారణం అవుతాయి. పుట్టిన తరువాత కొత్త ఉత్సాహం ప్రవేశిస్తుంది, పెల్లుబుకుతుంది. ఈ ఉత్సాహంలో కొందరు వ్యక్తులు చేసే పనులు ప్రజల జీవిత మార్గాన్ని, దేశగతిని మార్చివేస్తాయి. అన్నిటికీ కొత్తఅర్థాలు పుడతాయి. ఈ ఉద్యమాలను గురించి మనం చరిత్రలో చదువుకోవచ్చు. కాని హృదయంగమంగా ఆలోచించుకోవాలంటే, ఆ చరిత్ర నిర్మాణం చేసిన మనుషులు పాత్రలుగా వున్న 'నవలలు' తప్ప సృజనాత్మకమయిన మార్గం మరొకటి లేదు. (దేశనాయకుల జీవిత చరిత్రలు యీ పని చేయటానికి ప్రయత్నం చేసినా, నవలను చదివేటప్పుడు పాఠకుడికి కలిగే తాదాత్మ్యత, వాటివల్ల సమకూడదని మనం గమనించాలి.) ఈ అభిప్రాయాలను బహుశః దృష్టిలో వుంచుకుని శ్రీ మహీధర రామమోహన రావు కొన్ని నవలలు వ్రాశారు. వాటిలో ప్రజాఉద్యమాలకు ప్రతిబింబమయిన కథావస్తువు కలవి 'కొల్లాయి గట్టితేనేమి ?', 'రథచక్రాలు' అనేవి. ఈ రెండూ విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారి ప్రచురణలు. ఇటీవలనే తృతీయ ముద్రణ వెలువడింది మొదటి పుస్తకానికి. రెండవ దాని ద్వితీయ ముద్రణ 1977లో వచ్చింది.

దాదాపు 400 పేజీలు వున్న యీ నవలలు అన్నివిధాల ఉత్తమమయినవి. తెలుగు దేశం నడిగడ్డ లాంటి కోనసీమ 'ముంగండ' అగ్రహారం, మరో 'అగ్రహారం' స్థావరంగా – శ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబాల మధ్య, కుల మత భేదాలు, విధవా వివాహ సమస్య – వివాహం తాలూకు నీతి – హరిజనుల స్థితిగతులు – గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమాలు మొదలయిన కీలక సమస్యలను యధాతథంగా

నివేదిస్తూ, ఏమాత్రం ఉపన్యాస ధోరణి లేకుండా, పాత్రలు, వాళ్ల మాటలు, చర్యలు 'రికార్డ్' చేయడంతో చకచక నడిపించుకు పోతాయి యివి రెండూను. కాకపోతే 'రథచక్రాలు' లో మటుకు కొన్ని పాత్రలు కమ్యూనిస్టు పార్టీ పుట్టుక, విధానం, ఆలోచనా ధోరణిని గురించి ఎక్కువసేపు మాట్లాడవలసి రావడం తప్పనిసరి అవుతుంది. 'కాలక్షేపం' కోసం కాకుండా 'హృదయ వికాసం' కోసం నవల చదివే పాఠకుడికి యిది యెబ్బెట్టు అనిపించదు కూడాను.

'కొల్లాయి గట్టితేనేమి ?' అనే నవల, గాంధీ సహాయనిరాకరణ ఉద్యమం ప్రకటించిన సంవత్సరం జరిగిన సంఘటనలతో నిండినది. అంటే 1921 తొలి రోజుల్లో జరిగిన కథ. ఈ ఉద్యమ ప్రకటన ఒక బ్రాహ్మణ యువకుడి ఆలోచనలలో, జీవితవిధానంలో యెలాంటి మార్పు తెచ్చిందో చక్కగా వివరిస్తుంది. 'రామనాథం' అనే కాలేజి విద్యార్థి చదువు మానేస్తాడు. అతనికి తల్లి తండ్రీ లేరు. తల్లి అక్కగారి పోషణలో పెరిగాడు. ఆ దంపతులకు యితను ప్రీతి పాత్రుడు. కాస్తో కూస్తో ఆస్తి వున్న వాడు. ముంగండ అగ్రహారం తాలూకు శిష్టాచార బ్రాహ్మణ కుటుంబాలలో యితనివల్ల యెలాంటి విపర్యాలు వచ్చిందీ, స్నేహితులు బంధువులు యితని చర్యలను ఎలా అవును – కాదు అనకుండా గోడమీద పిల్లులు గానో, గాలివాటు మనుషులుగానో వుండి పోయిందీ నవల పొడూగునా కళ్లకు కట్టినట్లుగా చిత్రీకరణ జరిగింది. కాలేజీ మాని క్రిందికి దిగగానే అతనికి ఎదురయింది - 'తిరిగి ఎలాగయినా కాలేజీలో చేరిపో' అని ఆదేశాలు సలహాలు యిచ్చే మిత్రులు, బంధువులు, తల్లితండ్రులు, మామగారు వగయిరా. అతను 'ఆదర్శం' గా తీసుకున్న కాలేజీ మాస్టర్లు, బావమరిది – యితను లెక్చరరు – కూడా అతని చర్యలను మనస్ఫూర్తిగా ఆమోదించలేదు. ఒక పక్క నోటి మాటలతో తనను పొగుడుతూనే, వీలయినంత వరకూ ఎక్స్ప్లాయిట్ చేయటానికి (దోచుకు తినడానికి) జంకని జనం మధ్య యిరుక్కుని ఉక్కిరి బిక్కిరి అయిపోతాడు. అయితే ఒక సంవత్సరం లోపల స్వరాజ్యం వచ్చి తీరుతుంది అన్న గాంధీ వచనం అతనికి హృదయం లోతుల్లోనికి చొచ్చుకుపోతుంది. తన హృదయం చెప్పినట్లే నడుచుకుంటాడు గాని, అడుగడుగునా అభిప్రాయాలు మార్చుకుంటూపోడు. ఇలా మార్చుకుంటూ పోయేవాళ్లను (అగ్రహారం బ్రాహ్మణులు – బంధువులు – స్నేహితులు) చూచి 'అయ్యోపాపం వీళ్ళు యింతే కదా!' అనుకుంటాడు ధైర్యంగా.

'చక్కగా కాలేజి చదువు సాగించి ఐ. సి. యస్. పరీక్షలో నెగ్గి యేదోఒక జిల్లాకు కలెక్టరుగా రావడం' అనేది అతని ముందు అందరూ సిద్ధంచేసి వుంచిన ప్రణాళిక. పిల్లనిచ్చిన మామగారు ఆ 'సుదినం' కోసం (తన అల్లుడు కలెక్టరు) ప్రగాఢంగా పలవరిస్తూన్నాడు. కాని 'గాంధీ మనిషి' గా రూపాంతరం పొందిన తరువాత 'వాడికీ నాకూ సంబంధం లేదు' అని ప్రకటించి ఊరుకోవడమే గాక యింటికి వచ్చిన వాడిని నిష్కారణంగా చావు దెబ్బలు కొట్టి, దొంగకేసు బనా యించి జైలుకు పంపుతాడు. జైలునుంచి బయటకు వచ్చాక నయినా, కూతురు కాపు రాన్నిగురించి సజావయిన ఆలోచనలు చేయలేకపోయినాడు. చివరకు అల్లుడుని కాల్చిచంపి వేయటానికి తుపాకి నిలిపి కూడా, అతడు ఎదురొమ్ము చూపితే చుట్టూ

వున్న జన సందోహానికి భయపడిపోయి చేయిదించాడు గాని 'అది కూడని పని' అను కుని మానుకోలేదు. దీనికంతకూ కారణం ఆ మామగారు పోలీస్ ఇన్‌స్పెక్టరు అవడం! బ్రిటిషు వాళ్లు లేకపోతే భారతదేశం లేదనుకునే 'నీతి' కి కట్టుబడిన వాడు అవడం! పైగా 'లలిత దీక్ష' పొంది ఆచారవ్యవహారాలు నడుపుతున్న వ్యక్తి. అధికార లాలసతో ఊగిపోతున్న మనస్సు.

రామనాథం పెద్ద తండ్రి ఒకాయన, విశ్వనాథం, భార్య పోగా ఒక బలిజ కులస్తురాలిని చేరదీసి వుంటాడు. వాళ్లకు 'వెంకటరమణ' అనే కొడుకు, 'బ్రాహ్మణీకంలో అబ్రాహ్మణీకం అయిన పనికి, ఆ ముగ్గురూ ఎలా వేగిపోతారో నవలలో అవసరం అయినంత వరకూ కనిపిస్తుంది. సాంఘిక వ్యవస్థ ఎలా కుళ్ళిపోతూందో చూపటానికి యీ ఉదంతమే కాకుండా, విధవాడపడుచులు 'అరవ చాకిరీ' చేయడం; హరిజనులకు తాగే నీరు పోయలేకపోవడం; వాళ్ళు ఊరి వీధుల్లో నడవటానికి లేకపోవడం; అర్థం – ప్రయోజనంలేని వెనకటి ఆచారాలకే అంటి పెట్టుకువుంటామనీ, అనాచారం అనుకునే దాన్ని చేయవలసి వచ్చినప్పుడు ప్రాణా లయినా వదులుతామనుకోవడం; యిటువంటి సంఘటనలన్నీ తమంత తామే స్రావ రించుకుని కథానాయకుడి 'వివేచనా శక్తి' ని మేల్కొల్పడానికి దోహదం చేస్తాయి. 'వెలి' లాంటిది లేకపోయినా పెంచిన ప్రేమతో కొట్టుమిట్టులాడే తలిదండ్రులే జెయిలు నుంచి బయటకు వచ్చాక అతన్ని యింటిలోనికి రానివ్వరు. భోజనం పెట్టకపోవడం సరేసరి! ఊరి బయట తోటలోనే 'పాక' వేసుకుని కూర్చున్నప్పుడు అతనికి అర్థిక సమస్యలు కూడా తోడవుతాయి. భార్యతో ప్రత్యక్షంగా మాటాడు దామని ప్రయత్నంచేసిన మనిషికి, అక్కడ చుక్కెదురే అవుతుంది. భార్య 'నీవు కోర్టుకు వెళ్ళినా సరే నేను నీతో కాపురానికి రాను' అని స్పష్టంగా చెప్పేస్తుంది. అతను అసహాయుడు అయిపోతాడు.

అతనికి కాస్తో కూస్తో బాసటగా నిలచిన వాళ్ళు రంగనాధరావు అనే లెక్చరరు, అబ్బయ్య నాయుడు కుటుంబం, దువ్వూరి సుబ్బమ్మ, కొంతవరకు పెద్ద తండ్రి విశ్వనాథం, బావమరిది చంద్రశేఖరం – అతని భార్య సునంద (ఈమె అబ్రహ్మణి). అతను గ్రామపునర్నిర్మాణ కార్యక్రమం వయిపు దృష్టిమరల్చి దానిలో మునిగి పోతాడు, ఈ పనుల్లో ఎదురయ్యే సమస్యలతో తల బొప్పికడుతూ వుంటుంది. అతను మొదటిసారు అగ్రహారానికి తిరిగి వస్తూన్నప్పుడే 'స్వరాజ్యం' అనే అమ్మాయితో పడవలో పరిచయం అవుతుంది. నాయుడు గారి అమ్మాయి. చదువుకున్నది, ఇంకా చదువు కోవాలనుకుంటున్నది. చదువు మూలంగానే అత్త వారికీ, భర్తకూ అంటరానిదైపోయింది ఈ పిల్ల! గాంధీగారు చెప్పినట్లు 'సంవత్స రంలో దేశానికి స్వరాజ్యం' రాలేదు. కాని రామనాథానికి మటుకు ఆ గడువులో వ్యక్తిగతంగా 'స్వరాజ్యం' దక్కింది. ఎంతో ప్రయత్నంచేసి కూడ అతను భార్య 'సుందరి'ని దక్కించుకో లేకపోయినాడు, ఎంతో మానసిక సంఘర్షణ తర్వాత కూడా 'స్వరాజ్యం' నుంచి దూరం కాలేక పోయినాడు. (పాత్రల పేర్లలో భావనా బలానికి తగినట్లుగా సూచనాత్మకత వుండడం విశేషం.) పోలీసు జులుం అతని జీవితంలో గొప్ప మలుపు. 'స్వరాజ్యం' పైన యీ జులుం జరిగినప్పుడు

మామగారి చేతిలోని రివాల్వర్ గొట్టంకు ఎదురుగా రొమ్ము చూపి నిలుచుంటాడు ఎంత ఆచారాల పుట్టలో మునిగి తేలిన వాడయినా, వివేచన జ్ఞానం వున్నప్పుడు — కాస్తో కూస్తో వికాసం పొందినప్పుడు – సౌందర్యం వయపు కాకుండా వ్యక్తిగత (సామాజిక) శ్రేయస్సు వయపు మొగ్గుచూపుతాడు ; విషయాలలోత్వానికి బలిగాకుండా హృదయ ప్రాధాన్యానికి తల ఒగ్గుతాడు అన్న 'సూక్తి' యిక్కడ చక్కగా 'సూచితం' అవుతోంది. మానవ మనస్తత్వ పరిశీలనలో రామనాథం అనుభవాన్ని ప్రాపంచిక జ్ఞానాన్ని పొందగలిగాడు. ఎన్ని కబుర్లు చెప్పినా, మనుష్యులు అధికారం, ఐశ్వర్యం వున్నవాళ్ల చుట్టూనే మూగుతూ వుండడం అతను కళ్ళారా చూస్తాడు. (కాశీనాధుని చుట్టూ బ్రాహ్మణ్యం తిరగడం, శంకరశాస్త్రి తాటాకుమీద గాంధీ యుగపురుషుడన్న శ్లోకం వ్రాసుకు రావడం, అందరూ పంక్తి భోజనాలకు కూర్చోవడాన్ని ఆక్షేపించేవారే వడ్డనకు పూనుకొనడం – –). ప్రజలలో వున్న మూక వుమ్మడి మనస్తత్వం రామనాధానికి కొట్టవచ్చినట్లుగా కనిపిస్తుంది.

సనాతన ఆచారాల పట్ల అప్పటి యువకుల వైఖరి యేమిటో, రాజకీయాలు అనేవి ఎలాంటి సాంఘిక పరిణామాలను, వ్యక్తిగత జీవితాలలో తబ్బిబ్బులను తీసుకు వస్తాయో యీ నవలలో లలితంగా సుకుమారంగా చూపించారు, శ్రీరామమోహనరావు. 1921లో జరిగిన బెజవాడ అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశంతో యీ కథ అప్పటికి సమాప్తం అవుతుంది.

రెండవ నవల 'రథచక్రాలు' యింత కంటే వస్తువైవిధ్యం కలది. (ఈ వైవిధ్యాన్ని గందరగోళంగా రూపించుకునే అమాయకు లుంటారు.) దేశానికి స్వాతంత్ర్యం రావడానికి ముందు, వచ్చిన తర్వాత — ఒక్కో సంవత్సరం (అంటే 1946 – 48) దేశంలోని రాజకీయ పరిస్థితి, ముఠాలు, ప్రజా శ్రేయస్సు పట్ల అప్పుడే ప్రారంభమయిన అలక్ష్యం, కల్లోలాలను ఎవరికివారు తమకు ఉపయోగకారిగా మలుచుకోవడం వంటి సంఘటనలతో మళ్ళీ అగ్రహారపు బ్రాహ్మణ యువకుడినే ప్రధాన పాత్రగా తీసుకుని ప్రతిభావంతంగా తయారుచేసిన నవల యిది.

ఈ నవలలో 'సత్యానందం', 'విశ్వపతి' రెండు రకాల ధోరణులకు చెందిన వాళ్ళు. సత్యానందం కాంగ్రెస్ పార్టీలో సభ్యుడుగా వుండి, ఆ పార్టీవాళ్ళు ప్రజలకు దూరంగా పోతూ అరాచక మయిన పనులు చేస్తూవుండటాన్ని గమనిస్తూ నిస్సహాయంగా వుండి పోయిన వాడు. విశ్వపతి కాంగ్రెస్‌తో విడివడి పోయి 'కమ్యూనిస్టు'గా తయారయినందువల్ల జీవితంలో మొట్టమొదటిగా ఎదుర్కో వలసిన యిబ్బంది – చిన్నతనం నుంచి ప్రియసఖిగా వలచు కున్న 'భద్ర' సత్యానందానికి భార్య అయిపోవడం! తరువాత సత్యానందం పట్లఎంత గౌరవం, మన్నన వున్నా అతని ఇంటికి చొరవగా వెళ్ళలేక పోవడం! తరువాత తన తండ్రి దివాన్ అయి వున్నా సమష్టి ప్రయోజనాలకు యీ బంధుత్వాన్ని ఉపయోగించుకోలేక పోవడం, పెంచిన వాళ్ళే తుంచ చూస్తున్నారని బహిరంగంగా చెప్పుకోలేక పోవడం! విశ్వపతి జీవితం అంతర్గతము బహిర్గతము అయిన

సంఘర్షణలకు ఆలవాలం. అనుభవించే వాళ్ళకు తప్ప యితరులకు అర్థంకాని బాధ అతనిదీ, భద్రదీని.

మాలపల్లి అంటుకోవడంతో నవల ప్రారంభం. సత్యానందం, తోటి యువకులు ఆర్పుతారు. నీడలేని మాలపల్లి జనానికి పాకలు వేస్తారు. అన్నాలు పెడతారు. చందాలు పోగుచేస్తారు. నిర్మాణ కార్యక్రమాల్లో యేమాత్రం పాలు పంచుకోని వాళ్లు పునఃప్రతిష్ఠలో పాల్గొనాలని ఆదుర్దా చూపుతారు. కాంగ్రెసు కార్యకర్తలలోనే రెండు అభిప్రాయాలు, చీలికలు తయారవుతాయి. 'పని జరగడం ప్రధానం కాదు, ఎవరు చేశారో అది ప్రధానం' అయిపోతుంది. సత్యానందం రాజకీయ నాయకులలోని ద్వంద్వ మూర్తులు చూడగలుగుతాడు. అర్థంచేసుకుందుకు వృధా ప్రయత్నం చేస్తాడు. 'హరిజన సమస్య' తో మాల పల్లి జనాన్ని కాంగ్రెస్ పోగొట్టుకుంటూందే అని నిర్వేదం పొందుతాడు. కమ్యూనిస్టులవల్ల గ్రామానికి మంచి కలగడం అతనికి రుచించదు. కాని తన వాళ్లు వేసే దొంగఎత్తుల కన్న అదే నయం అనుకుంటాడు ఒక స్థితిలో.

నవల కంతటికీ, 'హరిజన సమస్య' ను వాడుకుని దేశనాయకులు ప్రజా శ్రేయస్సుకు మారుగా 'అరాజకీయాన్ని' దేశంలో ప్రవేశపెట్టడం 'కీలక' మయిన ఆయువు పట్టు. సమస్యను యథాతథంగా చూచి పరిష్కారానికి సజావయిన మార్గాలు సూచించే విశ్వం లాంటి వ్యక్తులు వ్యక్తిగత జీవితానికి, సాంఘిక పరిగణనకు ఎలా దుఃఖ భాజనంగా మిగిలిపోతారో సోదాహరణంగా కనిపిస్తుంది నవలలో. సమస్య చుట్టూ పరిభ్రమణం చేసి, ఎసంబ్లీలలో చేతులు ఎత్తేవాళ్లు నిజంగా 'ఎందుకూ ప్రజలకు కానివాళ్ళు' అయిపోతారని స్పష్టీకరణ కనిపిస్తుంది.

రాజకీయ పరమయిన ఈ అల్లకల్లోలాలు వ్యక్తుల జీవితాలతో ఆటలాడు కోవడం, హృదయాలు చించివేయడం, ఆత్మీయతలు, రక్తసంబంధాలు యెందుకూ కాకుండాపోవడం, మనిషికి మనిషికి సదవగాహన సుతారమూ యేర్పడక పోవటానికి దోహదం చేయడం – యిలాంటివన్నీ అతి సహజంగా ప్రాప్తించడం కనిపిస్తుంది. ఏ సంఘటనా కథాగమనం కోసం తెచ్చి అతికించినట్లు కనిపించదు. ఒక్కొక్క స్థితిలో 'అట్లా జరగకపోతే అది అసహజమే సుమా !' అనిపిస్తుంది (తండ్రి కొడుకును గుర్తించకపోవడం లాంటిది. తండ్రి దురహంకారానికి ప్రతీక అయితే కొడుకు హృదయానికి దురహంకారం వున్నచోట హృదయం వికసించదు. – కనబడదు అసలు). కొడుకుపై కక్ష కొద్దీ మేనగోడలును పైవాడికి యిచ్చి వివాహం జరిపిస్తారు తల్లిదండ్రులు; అతడు జెయిలునుంచి వచ్చిన తర్వాత పిలిపించే ప్రయత్నమే చేయరు; (భద్రకు మంచి మొగుడు, వైవాహిక జీవితం సమకూర్చడం వల్ల, కథాగమనంలో పాఠకుల దృష్టి మరో దిక్కుకు పోయి ప్రధాన సమస్యకు గ్రహణం పట్టకుండా ఉపకరించింది. ఇది రచయిత చాకచక్యం) ఇంటి ముంగిటకు వచ్చినా పలకరించరు – గుర్తించరు.

విశ్వం మాలపల్లికి సేవచేయడంలో – మరియమ్మతో అక్రమ సంబంధం అనే అపవాదుకులోను కావలసివస్తుంది. సత్యానందం తప్ప తతిమ్మ ఊరివారంతా

యిందుకు 'ఇజ్యం' పోసేవారే. జానకి అనే బ్రాహ్మణ వితంతు యువతి పునర్ని ర్మాణ కార్యక్రమాలలో పాల్గొని విశ్వంతో పరిచయం పెంచుకుంటుంది. పరస్పర ఆకర్షణలు యేర్పడతాయి. 'జానకి' కి కులాల తాలూకు అహంకారం తొలగిపోయే పరిస్థితులు కూడా యేర్పాటు అయినాక, భద్ర వారిద్దరినీ కలిపే ప్రయత్నం చేస్తుంది. ఇది ఫలిస్తుంది అని సూచన మాత్రం.

గ్రామంలో పరిస్థితులు చక్కబడిన తర్వాత, కూలీలలో వున్న సంఘీ భావం – పార్టీ పట్ల మక్కువ చూచి సత్యానందం పరిపూర్ణహృదయుడవుతాడు.

నవల మొదటి భాగంలో గ్రామ పునర్నిరాణ కార్యక్రమం ప్రధాన వస్తువు కాగా, రెండవ భాగంలో విశ్వం కుటుంబ వ్యవహారాలకు, మానసిక సంఘర్షణకు స్థానం అయింది. మూడవ భాగంలో తిరిగి మాలపల్లె గ్రామ సమస్య జనపనార విత్తనాల పంపకంలో పోలీసుల ప్రమేయం, క్రమేపీ శాంతి నెలకొనడం వస్తువు. 'కొల్లాయి గట్టితేనేమి' లో కనిపించే చురుకుతనం, చదివించే ధోరణి (రీడ బిలిటీ) యీ నవలలో దొరకదు. కాని దేశ పరిస్థితి తెలుసుకొందుకు పాఠకుడు ప్రయత్నపూర్వకంగానయినా చదవవలసిన నవల యిది.

సమకాలిక సన్నివేశాల ప్రోదిలో జనజీవనం ఎలా రూపుదిద్దుకున్నదో యీ నవలలు కూలంకషంగా తెలుపుతాయి. శ్రీ రామమోహనరావు తెలంగాణ ఉద్యమ ప్రాతిపదికలో కూడా ఒక నవల వ్రాశారు. ఒక సూచన, దేశ స్వాతంత్ర్యం వచ్చే సమయానికి స్కూల్ ఫైనల్, అప్రాంతపు చదువులో వుండి యీ 30 సంవత్సరాలలో జీవితాన్ని పరామర్శచేసిన పాత్రలతో వీరు ఒక నవల వ్రాస్తే, పరిపాలనలోని లోపాలు పరిపాలకుల అవినీతి ప్రజలను చీమునెత్తురు లేని వాళ్ళుగా తయారు చేయడము, తప్పుడు పనులతో రాజీ అయిపోయే మనస్తత్వం జాతిని నిర్వీర్యం చేయడము, వివేకవంతుల మనుకునే వారు చేసే అన్యాయాలు – యీనాటి యువకులకు కాస కనువిప్పు కలిగించి వివేచనాపరులను చేయడానికి అవకాశం వున్నది.

ప్రమాణికమయిన యీ నవలలు రచించిన శ్రీ రామమోహనరావు అభినందనీయులు. అలాగే ప్రచురణ కర్తలు కూడా. పోతే 'కొల్లాయి గట్టితే నేమి'లో వచ్చిన అచ్చుతప్పులు పెక్కులు. పుస్తకాలను 'సెక్షన్ బైండ్' చేయించి నట్లయితే చదివే వాళ్ళకు మరింత సౌకర్యంగా వుండేది. 'రజతోత్సవ సంవత్స రం'లో అచ్చువిషయంలో మరింత శ్రద్ధవహించడం అవసరం కదా! ఇంక పుస్త కాల సంపాదకత్వ విషయంలో కొన్ని సూచనలు; రచయిత యితర రచనల పట్టీ ఎక్కడ కనిపించదు. తెలుగు ప్రచురణలలో సాధారణగా యిది అపరూపం అయినా, అవసరం అయినదే. 'కొల్లాయి గట్టితే నేమి' నవలకు ముందు మాట ఒక పూర్వ సమీక్షనుంచి యిచ్చారు. అయితే యీ సమీక్షలో 'చారిత్రక నవల లక్షణాలు' ఫలానా Georg Lukacs అని ఫుట్‌నోట్ వుంది. అది ఇక్కడ ఉదాహృతం కాక పోవడం లోపం. అంతకంటె ఎక్కువ, ఈ నవలకు ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడమీ 1968-69 సంవత్సరానికి బహుమతి ప్రదానం చేసింది, ఉత్తమ నవలగా ఎన్నిక చేసి. ఈ విషయాన్ని నవల 'ఇన్నర్ టైటిల్' లోనయినా ప్రకటించకుండా వుండడం అన్యాయం.

# రాజకీయ చలన చిత్రం

ఒక ప్రేక్షకుడు

పశ్చిమ బెంగాల్ వరద బాధితుల సహాయ నిధికోసం నవంబరు 5 నుండి 8వ తేదీ దాకా మద్రాసులో బెంగాలీ చలన చిత్రోత్సవం జరిగింది. 'మృగయా', 'పదాతిక్', 'ఒక ఊరి కథ' (మృణాల్ సెన్); 'జన అరణ్య' 'పరాస్ పత్తర్' (సత్యజిత్ రే); హంగ్రీ ఆటమ్ (గౌతమ్ ఘోష్ - డాక్యు మెంటరీ) చిత్రాలు ప్రదర్శించ బడ్డాయి. వీటిలో 'పదాతిక్' చిత్రం చాలా మందిని ఆలోచింపజేసింది. ఈ ప్రదర్శనకు మృణాల్ సెన్ హాజరై చిత్రం జరుగుతున్నంత సేపూ ప్రత్యక్ష వ్యాఖ్యానం ఇవ్వడం, ప్రదర్శనానంతరం ప్రేక్షకులతో ఇష్టాగోష్ఠి జరపడం మరో విశేషం. స్థూలంగా 'పదాతిక్' చిత్ర కథ ఇది:

కథాకాలం 1973 లో పశ్చిమ బెంగాలులో సంభవించిన రాజకీయ సంక్షోభం నాటిది. ఒక వేపు పాలకవర్గం ప్రజావుద్యమాలను నిర్దాక్షిణ్యంగా అణచి వేస్తూ వుంటే, మరో వేపు వామపక్ష తీవ్ర వాదుల్లో అభిప్రాయ భేదాల కారణంగా చీలిక లేర్పడి కలహించుకుంటున్న రోజులు. ఈ పరిస్థితుల్లో తీవ్రవాద రాజకీయాలకు ప్రభావితుడై అజ్ఞాత్థ వాసంలో వున్న ఓ యువకుణ్ణి పోలీసులు అరెస్టు చేస్తారు. పోలీసు వేన్ లోంచి తప్పించుకున్న ఆ యువకుడు తన పార్టీ నాయకుని ఆదేశానుసారం ఒక ధనికురాలైన యువతి యింటిలో తలదాచుకుంటాడు. ఆమె ఒక పెద్ద పంజాబీ వ్యాపారి కూతురు, కలకత్తాలోనే పుట్టి పెరిగింది. ఒక బెంగాలీని వివాహమాడివిడాకులు తీసుకుంది. కలకత్తాలోని ఒక పెద్ద పబ్లిసిటీ ఫరంలో వుద్యోగం చేస్తూ, ఒంటరిగా వుంటోంది. ఆమె ఆరేళ్ళకొడుకు డార్జిలింగ్‌లో కాన్వెంటులో చదువుకుంటూ వున్నాడు.

అక్కడ తలదాచుకున్న యువకునికి, ఆ యింటికీ జైలుకి తేడా కనిపించదు. ఆ గదివదలి అతనెక్కడికీ కదలకూడదు. ఏమీచెయ్యకుండా గోళ్ళు గిల్లుకుంటూ, ఇరవై నాలుగ్గంటలూ ఆ నాలుగు గోడలమధ్య కూర్చుని తను సాధించేదేమిటో బోధపడదు. క్రమంగా అతనిలో ఆత్మ పరిశీలన ప్రారంభమౌతుంది. తమ వుద్యమాన్ని గురించి, నాయకులు నిర్దేశించిన పంథాను గురించి మొదటి సారిగా ఆలోచించే అవకాశం కలుగుతుంది ఆ అజ్ఞాత వాసంలో. విప్లవ రాజకీయాలకు ప్రభావితులైన తనలాంటి యువకుల మద్దతు 'పార్టీ'కి వున్నమాటనిజమే. కాని ప్రజల మాటేమిటి? వారు తమ విప్లవ పంథాని సమర్థిస్తున్నారా? సాయుధ విప్లవానికి ప్రజలు సుముఖంగా వున్నారా? ప్రజల్లో తమకున్న పలుకుబడి ఎటువంటిది? తాము ప్రజల నుంచి దూరం కావటం లేదా? ఈ ప్రశ్నలు అతన్ని పదే పదే వేధిస్తున్నాయి. పార్టీకి, తనకు మధ్య కొరియర్‌గా వుంటున్న మిత్రునితో తన సందేహాలను పంచుకుంటాడు. అనవసరమైన ఆలోచనలకు తావివ్వటం మంచిది కాదని, పార్టీ

క్రమశిక్షణకి లోబడి పార్టీ ఆదేశానుసారం ప్రవర్తించడమే ఉత్తమమనీ సలహా ఇస్తాడు, కొరియర్ మిత్రుడు.

మన యువకునికి ఆశ్రయ మిచ్చిన యువతి మాజీ భర్త డబ్బుకోసం ఆమెని బ్లాక్ మెయిల్ చేస్తుంటాడు. ఆమె తన బాధలని, సమస్యలని తన యింటిలో వుంటున్న అతనితో పంచుకుంటూ వుంటుంది. ప్రత్యక్షంగా విప్లవ రాజకీయాలతో ఆమె కెలాంటి సంబంధమూ లేక పోయినా, వారి వుద్యమం పట్ల ఆమెకు సానుభూతి వుంది. ఆమె తమ్ముడు కూడా పంజాబులో కాలేజీ చదువుకి స్వస్తి చెప్పి, విప్లవ రాజకీయాల్లో పాల్గొని పోలీసుల చేత కాల్చి చంప బడ్డాడు. అంత వరకూ ఆమెనొక 'బూర్జువా'గా పరిగణించిన మన యువకుడు ఈ కథ విన్న తరువాత, ఆమె పట్ల సానుభూతి కనబరుస్తాడు.

పార్టీ ప్రజల సానుభూతిని పూర్తిగా కోల్పోతుంది. కార్యకర్తలు అరెస్టు కావడం, కొందరు పోలీసుల కాల్పులకు అమానుషంగా బలికావడం జరుగుతుంది. అయినా పార్టీ నాయకుడు మాత్రం తాను అనుసరిస్తున్న పంథా తప్పు అని ఒప్పుకోడు, తన పిడివాద ధోరణి మార్చుకోడు. పార్టీ విధానంమీద అజ్ఞాతంలో వున్న యీ యువకునికి కలిగే సందేహాలు, ప్రశ్నలూ ఎప్పటికప్పుడు కొరియర్ ద్వారా అతనికి తెలుస్తూ వుంటయ్. యువకునిలో ఒక 'రిబెల్'ని గుర్తిస్తాడు, అతనికి, ఆశ్రయ మిచ్చిన యువతికీ మధ్య ఏర్పడిన సాన్నిహిత్యాన్ని ఆసరాగా తీసుకుని, యువకుడ్ని పార్టీ నుంచి తొలగిస్తున్నట్టు ఫోన్ చేసి చెపుతాడు.

"పార్టీ అనేది ఏ ఒకరి సొత్తుకాదు. ప్రజా వ్యతిరేక శక్తులతో పోరాటం సాగిస్తూనే వుంటాను" అంటాడు యువకుడు.

తల్లి చావు బతుకుల్లో వుందనీ, చివరిసారిగా తనని చూడాలనుకుంటూ వుందని కబురందుతుంది అతనికి. తనకి ఆశ్రయమిచ్చిన యువతి, కారులో రహస్యంగా తీసుకెడుతుంది. తల్లి శవాన్ని మాత్రమే చూడగలుగుతాడు. తండ్రీ కొడుకులు కలుసుకుంటారు. అంత వరకూ తన కొడుకు రాజకీయాలని అసహ్యించుకుంటూ వుండిన తండ్రిలో రాజకీయ చైతన్యం కలుగుతుంది. పాలక వర్గం ప్రజల మీద జరిపే అత్యాచారాలే ఆ చైతన్యాన్ని కలుగజేశాయని, తండ్రి ఒక సమ్మెలో పాల్గొనే దృశ్యం ద్వారా సూచిస్తాడు దర్శకుడు. యువకునికి వీడ్కోలిస్తూ ఇలా అంటాడు తండ్రి: "వెళ్ళు! పోరాటం సాగించు."

ఈ చిత్రానికి కథ, స్క్రీన్ ప్లే: మృణాల్ సెన్-అషిస్ బర్మన్. ఛాయా

(తరువాయి 57వ పుటలో)

## ఆలస్యం మీది !!

ఆర్. దామెర

చుక్కల్తో ముద్దు పెట్టుకొంటూ
ధరలు కేబరే ఆడుతున్నాయంటే –
విచ్చల విడిగా వ్యాపార సంస్కృతి
పగటి వేషాలు వేస్తొందంటే –

అవును,
మీరు –
పొగ గొట్టాల్లా బొబ్బలు పెడుతూ
పడి శెలలు విసరితే తప్ప
అవి పారి పోవు -




"నానీ ఆ చింతకాయ ఎక్కడిదిరా? - చెప్పు?" కోపంగా అడిగింది తల్లి.

నాని భయపడ్డాడు - నోట్లో వేలు పెట్టుకొని భయం భయంగా తల్లి ముఖం కేసి చూడసాగాడు.

"నీకు ఆడుకోవడానికి ఎవరూ దొరకలేదా? ఆ చాకలి పిల్లలతో ఆడుతున్నావా ... ఇంకోసారి ఆడుతావా? చాకలి ఇండ్లకు పోతావా చెప్పు" అంటూ నానిని కొట్ట సాగింది నీలవేణి.

"వెళ్ళనమ్మా ... ఓమ్మ వెళ్ళనమ్మా ..." అంటూ ఆమె చేతుల్లోంచి తప్పించుకోవడానికి అటూ ఇటూ గింజుకోసాగాడు నాని.

"వెధవ.... ఇంకోసారి ఆ తక్కువ జాతి ఇండ్లకు వెళ్లావో వీపు చీరేస్తా జాగర్త -" అంది నీలవేణి కొడుకును వదిలేస్తూ -

"ఊఁ... ఊఁ..." అని ఏడుస్తూ అంగీ చివరతో కండ్లు వొత్తుకోసాగాడు నాని.

ప్రక్కగదిలో నుంచి తొంగి తొంగి చూస్తున్నది చంటిది. "నానిగాడి పని బాగా అయింది. లేకపోతె నాకివ్వకుండా తింటాడా చింతకాయ" అనుకుంటున్నది. నానిని అమ్మ కొట్టినందుకు ఎంతో సంబరపడసాగింది.

"వింటున్నావే చంటిదాన ... నువ్వు వెళ్తే నీ వీపు అంతే ..." అంది నీలవేణి.

అమ్మో! అనుకుంటూ తుర్రున అక్కడినుంచి పారిపోయింది చంటిది.

నీలవేణి భర్త రామిరెడ్డి తనకున్న నాలుగెకరాల పొలాన్ని సాగుచేస్తూ మామూలుగా సంసారాన్ని నడుపుకొస్తున్నాడు. 'మామూలుగా' అని ఎందుకు అనాల్సి వస్తున్నదంటె ఆ ఊళ్లో అంత తక్కువ పొలం వున్న రెడ్డి కుటుంబం మరోటి లేదు. ఉన్న ఇరవై ముప్పై రెడ్డి ఇండ్లు ఒక దగ్గతే ఉన్నాయి. - వాళ్ళ పొలాలు ఒక దగ్గతే ఉన్నాయి. ఆ ఇండ్లు దాటిన తరువాత చెఱువు కట్టకు దగ్గఱగా చాకలి ఇండ్లు ఉన్నాయి. ఆ చాకలి ఇండ్లు దాటితే చింతల తోపు, ఆ తరువాత పొలాలు ఉన్నాయి.

రెడ్లలో నరసింహారెడ్డిని పెద్ద దొర అంటారంతా నూరు ఎకరాలకు పైగా పొలం, నాలుగైదు దొడ్ల పశువులు, నౌకర్లు ఉన్నారు పెద్ద దొరకు. అతని కంటికి రామిరెడ్డిలాంటి వాండ్లు క్రిమి కీటకాల్లా కనిపిస్తారు.

ఈమధ్య రామిరెడ్డి కుటుంబం ఆర్థికంగా ఎన్నో ఇబ్బందులకు గురికావల్సి వచ్చింది. ఉన్న నాలుగెకరాలలో రెండెకరాలు అమ్మి చెల్లెలి పెండ్లి చేశాడు రామిరెడ్డి. మిగతా రెండెకరాలు ఏ అప్పో తెచ్చి సాగుచేస్తే వచ్చే ఆదాయంలో మూడొంతులు అప్పుతీర్చడానికి, వడ్డీ కట్టడానికే సరిపోతున్నది. అయినా ఎవరితో ఒకమాట పడక తన కష్టం తాను పడుతూ, పరువుగా బతుకు నీడ్చుకొస్తున్నాడు రామిరెడ్డి.

నీలవేణి మనస్తత్వం రామిరెడ్డి మనస్తత్వానికి భిన్నమైందనే చెప్పాలి. రామి

రెడ్డికి తోటి రెడ్ల సంపాదనలు చూసి ఎన్నడూ అసూయ, ద్వేషం కలుగలేదు. ఏదో ఎవరికి వచ్చిన అవకాశం వారిది అనుకునే స్వభావం అతనిది. నీలవేణికి మాత్రం తామలాగ లేమే అన్న బాధ కలుగుతూంటుంది ఎప్పుడూ! – ధన వంతులన్నా, తమ కులం వారన్నా ఆమెకు అభిమానం. పేదలంటే ఆమెకు అసహ్యం. కులభేదం ఆమెలో బాగా నాటుకపోయింది. పేదలతో స్నేహం చేస్తే తామింకా పేదవాండ్లమైపోతామని ఆమె భయం. ధనవంతులతో స్నేహం చేస్తే తాము కూడా వాళ్ళలా ధన వంతులం కాగలమని ఆమె నమ్మకం. అందుకే పిలవకున్నా అప్పుడప్పుడు నర్సింహారెడ్డి ఇంటికి వెళ్ళి వస్తుండేది. అతని పెద్ద భార్య . . . అంటె పెద్ద దొరసానితో చనువు పెంచుకోవాలని ఆమె తపన –

ఒక రోజు నీలవేణి పెద్ద దొరసాని మేడకు పోయేసరికి ఆమె భోజనం చేసి అప్పుడే విశ్రాంతి తీసుకుంటున్నదట, సాయంత్రం రమ్మని చెప్పిందంటూ పనిమనిషి వచ్చి చెప్పింది.

నీలవేణి తిరిగి వస్తుంటె పెద్దొర ఎదురయ్యాడు. అతణ్ని చూసి కంగా రుగా భుజాల చుట్టూ కొంగు కప్పుకొంది. అప్పటికే పెద్దొర చూపులు ముండ్ల పంది దులిపిన ఈకల్లా ఆమెపై వాలి గుచ్చుకున్నాయి.

మీసాలు మెలేస్తూ ఏదో అన్నాడు. ఆ మాటల్లో తన భర్తను చులకన చేయడం ఆమె గమనించక పోలేదు. తలవంచుకొని గబగబా ఇంటికి వచ్చేసింది. జరిగిన విషయం భర్తకు చెప్పింది. అతని పెదవుల మీద ఒక పేద నవ్వు కదిలింది.

ఇదీ జరిగిన రెండు మూడు రోజులకు మరో సంఘటన జరిగింది –

పెద్దదొర పొలాల తరువాత రామి రెడ్డి పొలం ఉంది. పెద్ద దొరకు ఎన్ని ఉన్నా ఇంకా కావాలనే ఉంటుంది. చివ రికి నీళ్ళు కూడా . . . ! రెండు మూడు కరెంటు బావులున్నా, చెఱువు నీళ్ళన్నీ తనకే కావాలని ఉంటుంది పెద్దదొరకు. అసలు ఊరి పొలాలన్నీ తనవే అయితే బాగుండునని ఉంటుంది అతనికి. ఊరి వాళ్ళంతా తన క్రింద పనిజేసే కూలీలై పోవాలి. అయినా ఇప్పుడు మాత్రం ఏం తక్కువైందని ? — ఊరి జనమంతా అతని కూలీలవలె, అతని కాలి కింద చీమల వలె అణిగి మణిగి ఉంటున్నారు.

రామిరెడ్డికి కరెంటు బావి లేదు. మోటబావి లేదు. చెఱువు నీళ్ళే ఆధారం. రామిరెడ్డి పొలం వెంబడి మరి కొన్ని రామిరెడ్ల పొలాలు . . . అంటే అతని వంటి పేద రైతుల పొలాలున్నాయి.

వర్షం పెద్ద దొరగారి కోసమే కుర వకపోయినా, చెఱువు పెద్దదొరగారి కోసమే నిండకపోయినా, కాలువలోని నీరు పెద్ద దొరగారి కోసమే పారుతూ లేకపోయినా పెద్ద దొర గారు అవన్నీ తన కోసమే అన్నట్టు వ్యవహరిస్తారు. అతడు దయతలచి వదిలిపెడితేనే క్రింది భూములు తడుస్తాయి. లేకపోతె అవి, వాటిని నమ్ముకున్నవాళ్ళ కడుపులు, బతుకులు కూడా ఎండిపోతాయి.

రెండు నిమిషాలు చాలు కొంచెం నీళ్లు వదలమని కాలువ మీద కాపలా ఉన్న పెద్ద దొర జీతగాన్ని బతిమి లాడాడు రామిరెడ్డి. అది కూడా తొందర పడి కాదు – పొద్దటినుంచి మధ్యాహ్నం దాకా ఇప్పుడు వదులుతాడో అప్పుడు వదులుతాడోనని ఎదురు చూసి ఎదురు

చూసి, అడిగాడు. అప్పటికీ వదలక పోవడంతో దుక్కి ఎండి పోతున్నదని అడిగాడు.

ఆ మాట జీతగాని చెవిన పడలేదు. అలాగని అతనికి చెముడేమీ లేదు. అదో రోగం. పెద్దదొర క్రింద పని చేస్తున్నాడు కదా. అతనికున్న రోగాలలో కొన్ని అంటుకున్నాయి – పెద్ద దొర చెప్పు క్రింద నలిగే చీమలకు ఆ చెప్పుల రోగం, ఆ చెప్పులు మోసే కాళ్ళ రోగం, ఆ కాళ్ళు మోసే మనిషి రోగం అంటుకోవడం సహజమే.

చూసి చూసి, చెప్పి చెప్పి రామిరెడ్డికి విసుగు, కోపం వచ్చాయి.

హాయిగా కాలుమీద కాలు వేసుకొని చుట్ట తాగుతూ ఆ జీతగాడు రామిరెడ్డి మాటలు ఖాతరు చేయలేదు. కనీసం అతని ముఖమైనా చూడలేదు.

కాలువకు అడ్డంగా కట్టిన ఆ పెద్ద కట్టను ఒక పక్క చిన్నగా తెంపేశాడు రామిరెడ్డి.

లేగ దూడకు పాలివ్వడానికి వచ్చే తల్లి ఆవులా రామిరెడ్డి పొలం వైపు ఉరకలు వేస్తూ పారసాగింది, కాలువలోని నీరు.

పాలు పితకడం కోసం వచ్చిన వాడు లేగ మూతిని కట్టివేసినట్టు ఆ కట్టను తిరిగి కట్టి —— "ఏం రాంరెడ్డి ఎట్లున్నది ఒళ్లు" అన్నాడు మరో రెడ్డి క్రింద పని చేసే ఆ జీతగాడు.

రామిరెడ్డి అతనివైపు చూసాడు – రెండు రోజుల క్రితం భార్య చెప్పిన విషయం గుర్తుకు వచ్చి ఒళ్లు మండింది.

"నీళ్లు వదులు తావా లేవా?" అని అడిగాడు కోపాన్ని అణుచుకుంటూ రామిరెడ్డి.

. "ఎహెహె . . . . . బెదిరిస్తానవా!" అంటూ హేళనగా నవ్వాడు జీతగాడు.

ఫెడేల్ మని అతని చెంపవాయించి– "మారు మాట్లాడితే కాలువల సొత్తి పెడ్తా జాగ్రత్త" అని ఉరిమిచూస్తూ, అడ్డుకట్ట మొత్తం తెంపేశాడు రామిరెడ్డి.

అతనిలో కట్టలు తెంచుకొని ఉబికి వచ్చిన కోపంలా, పేద రైతుల పొలాల వైపు ఉరకలువేస్తూ పారసాగింది కాలువలోని నీరు.

ఆ జీతగాని కళ్లు గిర్రున తిరిగాయి. "నిన్ను ఏం చేపిస్తనో సూడు" అంటూ కోపంగా అక్కడ్నుంచి వెళ్ళి పోయాడు.

అదంతా లెక్క చేయలేదు రామిరెడ్డి. విషయం తెలిసి పెద్ద దొర నరసింహా రెడ్డి మండి పడ్డాడు –"వీడు నా నౌకరును కొట్టే మొనగాడయిండా . . ." అని పండ్లు కొరుకుతూ హంటర్ తీసుకొని బయలు దేరాడు.

"నా కాలిగోటికి కొరగాని ఈ కొడుకు నా నౌకర్ను కొడతాడా – వాని అంతుచూస్తా – వాని ముందే వాడి పెళ్లాన్ని ఏం చేస్తానో చూడు" అంటూ బయులుదేరాడు.

ఈ విషయం తెలిసి నీలవేణి పిల్లలను తీసుకొని పొలం దగ్గఱికి పరుగెత్తింది. అక్కడ పొలం దగ్గఱ భర్త ఒంటరిగా ఉన్నాడు. ఆమెకు భయం వేసింది. అక్కడ ఒక క్షణం కూడా ఉండొద్దని ఊళ్ళోకి వెళ్దామని తొందర చేసింది. కాని రామిరెడ్డి ఒప్పుకోలేదు. "ఎవడొస్తాడో చూస్తా . . ." అంటూ పార భుజం మీద పెట్టుకున్నాడు. ఆమె ఎంత బతిమాలినా, ఏడ్చినా ప్రయోజనం లేకపోయింది.

తానే ఊళ్ళోకి వెళ్ళి ఎవరి సహాయాన్నైనా అర్థిస్తానని ఊరి వైపు నడిచింది నీలవేణి.

రాజిరెడ్డి ఇంటికి వెళ్ళి తనను, తన భర్తను, పిల్లలను తల దాచుకో నివ్వ మని ప్రాధేయపడింది. సంగతంతా తెలిసిన రాజిరెడ్డి రెండు చేతులు జోడించి – "తల్లీ! మమ్మల్నిలా బతు కనియ్యి" అంటూ బయటికి గెంటే యించాడు.

లకుమారెడ్డి ఇంటికి వెళ్ళి అతని కాళ్ళ మీద పడింది. "అమ్మో! పాముతో చెలగాటమా! ఇక్కణ్నుంచి వెళ్ళిపో ..." అంటూ వెళ్ళగొట్టాడు.

అలాగే మరో రెడ్డి ... మరో రెడ్డి ... ఎవరూ వాళ్ళ పక్షాన నిలవ డానికి ముందుకు రాలేదు.

వీథిలో నిలబడి బోరున ఏడ్వసా గింది నీలవేణి!

పెద్ద దొర నలుగురైదుగురు జీత గాండ్లతో పొలాల వైపు వెళ్ళి రామి రెడ్డిని కాలవలో పడేసి తన్ని కాళ్ళు చేతులు కట్టేయించి "నీ ముందే నీ భార్యనేం చేస్తానో చూద్దువు రారా..." అంటూ ఊళ్ళోకి లాక్కొచ్చాడు.

నీలవేణి గజ గజ వణికిపోయింది. పిల్లలు బల్లిలా ఆమెను కరుచుకొని నిల్చున్నారు.

ఆమె ముందు రామిరెడ్డిని మొహం మీద పెడేలు మని తన్నాడు పెద్దొర.

ఏడుస్తూ నీలవేణి "మీకు దండం పెడతాను .... మమ్మల్ని వదిలే యండి" అంటూ భర్తకు అడ్డంగా నిలు చుంది.

"రావే .... నిన్ను ..." అంటూ పిల్లలను లాగిపడేసి ఆమె రెక్క పట్టు కున్నాడు పెద్దొర.

అది ఊరు...

నడి వీధి ...

ఆమె ఏడుస్తున్నది ... అరు స్తున్నది... గింజుకొంటున్నది...

పెద్దొర వికటాట్టహాసం చేస్తున్నాడు.

ఆమె చీరను లాగుతున్నాడు...

ఎవరిండ్లలో వాళ్ళున్నారు. సమా ధుల్లోని శవాల్లాగా! కిటికీల నుంచి, తలుపు సందుల నుంచి చూస్తున్నారు.

ఈ విషయం ఎంకన్నకు తెలిసింది! ఎంకన్నది చాకలి వృత్తి. ఆ వృత్తి చేసే వాళ్ళందరికి ఎంకన్న మీద గౌరవం ఉంది. అతణ్ని తమ పెద్దగా భావిస్తా రంతా –

"ఇదేమన్న ఊరా అడివిరా... నా పానం పోయినా సరే... ఈ అన్నాయం సూడలేను–" అంటూ కొడవల భుజాన వేసుకొని బయలు దేరాడు. అతనితో పాటు ఆ వాడలోని ఆడ, మగ కదిలారు – ఆ గుంపును చూసి పక్క వాడలోని జనానికి ధైర్యం వచ్చింది. వాళ్ళకూ ఈ అన్యాయం అరి కట్టాలనే ఉంది – వాళ్ళూ వచ్చి చేరారు గుంపులో –

"ఆగు .." అన్న పిడుగులాంటి మాటలు విని వెనక్కు తిరిగి చూచాడు పెద్దొర.

"అళ్ళను ఒదిలేయి... లేకపోతె నిన్నిక్కణే నరుకుతం..." అన్నాడు దగ్గఱగా వస్తూ ఎంకన్న.

అతని చేతిలో కొడవలి ఉంది. అతని వెంటనున్న వాళ్ళ చేతుల్లో పారలు, గడ్డపారలు, కొడవండ్లు, రోకండ్లు, చీపురు కట్టలు ఉన్నాయి.

గుండె ఆగినంత పనైంది పెద్ద దొరకు! అతని పొలాలు, పశువులు, నోట్ల కట్టలు, జీతగాండ్లు... ఎవరూ రాలేదు... ఏదీ రాలేదు... అతణ్ని రక్షించడానికి!

నిలువునా వణికి పోతున్నా .....

‘‘మిమ్మల్ని ఏం చేస్తానో చూడం శిరా...’’ అన్నాడు పెద్దొర..

‘‘ఏ పో... నువేం జేత్తవు? ఇసోంటి పని చేసిన వంటె నిన్ను నరికేది కాయం...’’ అని ఎంకన్న ఉరిమి చూసే సరికి తోక ముడుచుకొని అక్కణ్నుంచి మెల్లగా జారుకున్నాడు.

రామిరెడ్డి కట్లు విప్పి వాళ్ళను తమ వాడకు తీసుక పోయాడు ఎంకన్న.

ఆమె కళ్ళలోని ఏదో పొర తొలగి నట్లనిపించింది. ఎంకన్న కాళ్ళ మీద పడబోయింది.

‘‘ఇదేంది తల్లీ...’’ అంటూ ఆమెను ఆపి... ‘‘నువ్వు మా తోబుట్టులాంటి దానివమ్మా... ఈ కులాలు, మతాలు మనం పెట్టుకున్నయి... మనం ఒక్క తల్లి పిల్లలం తల్లీ... ఈ లోకంల ఉన్నయి రొండే తెగలు. ఉన్నోళ్ళు, లేనోళ్ళు. ఉన్నోళ్ళ అగడాలు సిదక తొక్కాలంటె మనం కలిసుండాలె తల్లీ...’’ అన్నాడు ఎంకన్న–

నీలవేణి కిపుడెంతో బలం వచ్చినట్లనిపించింది!

తాము ఒంటరి వాళ్ళం కాదనిపించింది.

అదురు తగ్గింది.

## తేడా .... పి. శరత్ కుమార్

సర్కస్ వాడి చెప్పుచేతల్లో వున్న
చిరుత
నిలువు అంటె నిలుస్తుంది.
కదులు అంటె కదుల్తుంది.
దానికి పౌరుషం వుండేగాని
పోరంటే ఏమిటో తెలీదు.
గారడీ వాడికి లోబడి వుండే నాగు
వుష్ అంటే పడగ విప్పుతుంది.
ష్చ్ అంటె పడుకుంటుంది
దానికి సాధించే పగ వుండే గాని
సమర మంటే ఏమిటో తెలీదు
కాని
ఒకడి కాలి క్రింద బానిసగా బ్రతికే
మనిషి
ఆడించినట్లుగా ఆడడు
పాడించి నట్లుగా పాడడు
అతనికి తిరగబడ్డం తెలుసు.
అంధకారంలో
వెలుగు తోరణాల్ని అలంకరించడం
తెల్సు.

నాకు సంబంధించినంత వరకు జీవితాన్ని మొత్తంగా అనుభవించాలి. నేను రచయితను. పారుశ్ని, తండ్రి మొదలైనవి కూడా, అంచేత నా చుట్టూ జరిగే వాటన్నిటి గురించీ నాకు ఆసక్తి వుంది. నాకు నమ్మకం లేనిదాన్ని గురించి నేనెన్నడూ రాయలేదు. నా నమ్మకాలు, విశ్వాసాన్ని, బలపరచడానికి నేనెన్నడూ జంక లేదు.

నాకు ఆలోచన, ఆచరణ ఒకేవిధమైనవి. జీవితంలోని మంచి విషయాలు నాకు సంతోషాన్నిస్తాయి! బహురూపాలలో చెడుపు నన్ను బాధిస్తుంది. ఎక్కువ కాలం నేను జీవితంలోని బాధను నా కాలంలోని పతితత్వాన్ని, అనుభవిస్తుంటాను. నా మనస్సు రానున్న తరం వేపుకి పోతుంది దురాశలోనూ, నైతిక పతనంలోనూ, కూరుక పోతున్న గతకాలపు చేష్టలు పలితంగా బాధపడుతుంది స్వరాజ్యం వచ్చాక దేశంలో విలువలు అధోగతి పాలవుతున్నందుకు దిగ్భ్రాంతుడినవుతున్నాను గాఢవిషాదంలో నేను జీవిస్తున్నాను. సాహిత్యం ద్వారా నేనా విషాదపు బరువును దించుకోవాలను కుంటున్నాను. (కారంత్)

# వీరేశలింగంపై అభియోగాలు

అక్కిరాజు రమాపతిరావు

వీరేశలింగం పుట్టి నూట ముప్ఫయి సంవత్సరాలు గడిచాయి. పరమపదించి సుమారు అరవై ఏళ్ళు కావస్తున్నది.

ఇప్పుడాయన ఆధునికుడు కాడని, అధమ రచయిత అనీ, స్వాతంత్ర్యోద్యమాన్ని సమర్థించలేదనీ అవివేక ప్రసంగాలు చేస్తున్నారు కొందరు.

వాళ్ళు ఇంకా కొంచెం నేర్పుగా, చురుకుగా ఆలోచిస్తే వీరేశలింగంపై ఇంకా కొన్ని అభియోగాలు కూడ మోపవచ్చు. ఆయన శాకుంతలం అనువదించాడు కాబట్టి అభివృద్ధినిరోధకుడు. శాకుంతలం ఫ్యూడల్ వ్యవస్థను ప్రశంసిస్తుంది కదా. బహు భార్యాత్వాన్ని కూడా సమర్థిస్తుంది. అంతే కాదు. అమానుషమైన, అతిమానుషమైన సంఘటనల మాటేమిటి! అభ్యుదయ దృక్పథం వున్న వాడెవడూ శాకుంతలం అనువదించటమా!?

ఇంతే కాదు. తరువాత కాలంలో తన చిన్ననాటి రచనలను మెచ్చక పోయినా, సమర్థించక పోయినా అసలు శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధం - ఆ తర్వాత ఎవరో చమత్కారానికి నీరసం కూడ చేర్చారు - రచించి ఉండ వలసింది కాదు. అంతటితో ఊరుకున్నాడా! శుద్ధాంధ్రోత్తర రామాయణం, శుద్ధాంధ్ర భారత సంగ్రహం, రసిక జనరంజనం - కనీసం మూడొందల ఏళ్ళ కిందటి అభిరుచులాయనవి. పాతపండితుల, కవి చంద్రుల మస్తిష్కపు బూజు వాసన మాకు కొడుతున్నది - సరే ఈ పద్యాల కూర్పు కూర్చాడే అనుకుందాం, తన గ్రంథాలన్నీ సంపుటాలుగా వేసుకొనేటప్పుడు (1897 నుంచి 99 వరకు రెండేళ్ళు శెలవు పెట్టి తన రచనలన్నీ పది సంపుటాలుగా ఆయనే అచ్చు వేయించుకున్నాడు) వీటన్నిటినీ తగలెట్టి కుకవిత్వ దగ్ధకర్ముడు కాకూడదా!? ఆయనకు అభ్యుదయ భావాలు లేవని మేమంటామంటే అనమా!

1881 వ సంవత్సరం డిశెంబర్ 11 వ తేదీన ఆయన తెలుగు దేశంలో అగ్రవర్ణాల వారిలో మొదటిసారిగా స్త్రీ పునర్వివాహాన్ని తమ ఇంట్లోనే చేశాడు. అంతకు ముందే రెండు మూడేళ్ళుగా పూర్వరంగాన్నంతా సిద్ధం చేసుకుంటున్నాడు. అంతకు ఇంచు మించుగా పాతిక సంవత్సరాలకు పూర్వమే 'వితంతు వివాహాన్ని' శ్రుతి స్మృతులు కాని, పురాణేతిహాసాలు కాని నిషేధించడం లేదంటూ కలకత్తాలో ఈశ్వరచంద్ర విద్యాసాగరుడనే గొప్ప పండితుడు, కారుణ్యవాది, సంఘసంస్కర్త, దేశభక్తుడు, వంగసాహిత్యంలో అధునాతన వచన రచనకు వరవడి పెట్టినవాడు ఒక గ్రంథం బెంగాలీలో ప్రకటించాడు. బొంబాయి రాష్ట్రంలో కూడా, వీరేశలింగం నడుంకట్టి పూనుకోడానికి ముందే స్త్రీ పునర్వివాహం శ్రుతి, స్మృతి విరుద్ధమా కాదా అని వాద వివాదాలు చెలరేగాయి. ఖండన మండన గ్రంథాలు వెలువడ్డాయి. 1872 వ సంవత్సరంలో

బందరు నుంచి వెలువడుతుండిన పురుషార్థ ప్రదాయిని అనే పత్రికలో 'విధవా వివాహము శాస్త్ర సమ్మతము కాదనుట, 'వితంతువివాహ ఖండనము, సమర్థనము' అంటూ చర్చలు వెలువడ్డాయి. కొందరు పిదప కాలం వచ్చిందని తిడుతూనూ, కొందరు శాస్త్ర ప్రమాణాలు ఇందుకు వ్యతిరేకం కాదని వివరిస్తూనూ రాశారు, ఆ పత్రికలో.

వీరేశలింగం కూడ శ్రుతులు కాని స్మృతులు కాని, స్త్రీ పునర్వివాహానికి అభ్యంతరం చెప్పడం లేదని అదృష్టవశాత్తూ తనకు కనబడిన ఉపపత్తులను చూపాడు. తప్పేమిటి? శ్రుతులు స్మృతులు ఒప్పక పోతే తన సంస్కరణ కార్యక్రమాలన్నీ నిలుపు చేస్తానని అనలేదే! జన్మాంతరము, వర్ణము, ఈశ్వరదత్త పుస్తకములు, దయ్యములు, మత ద్వేషము, విగ్రహారాధనము మొదలైన వ్యాసాలలో ఆయన శ్రుతి, స్మృతి ప్రమాణాల వక్రభాష్యాలను ఖండించాడే. స్వార్థపరులు, స్వప్రయోజన కాంక్షులు, కపటులు, కల్లరులు, డాంబికులు, కూటసాక్షులు నిజమైన సంప్రదాయాన్ని ఏ విధంగా భ్రష్టుపరచారో చెప్పడం తప్పా! ఇదన్నీ నూరేళ్ళ నాటి సమాజాన్ని గూర్చి ఏమాత్రం ఆలోచించగల వాళ్ళకైనా, ఆ విధంగా వీరేశలింగం చేయడం ఎంత తప్పనిసరో అర్థం కాకుండా ఉండదు. అభ్యుదయోల్బణంతో, ఉక్కిరి బిక్కిరై పోతున్న ఆధునికోగ్రవాదులకు కాదు ఆయన శ్రుతి స్మృతి ప్రమాణాల ప్రస్తావన తీసుకొని రావడం! ఆనాటి పీఠాధిపతులకోసం. దుర్మతాచార్యుల కోసం. వాళ్ళను ఎదుర్కోవాలి. వాళ్ళ సిద్ధాంతాలలోని, వాళ్ళు చూపుతున్న ప్రమాణాలలోని లోపాలను వాళ్ళకు తెలియజెయ్యాలి. అంతకు తప్ప వేరే మార్గమేముంది! మీవి వక్రభాష్యాలని వాళ్ళకు చెప్పాడు. శ్రుతి, స్మృతి, శిష్టాచారం - ఈ మూడున్నూ పూర్వ పూర్వ బలీయాలు. ప్రాధాన్యం కలవి. కాబట్టి ఈ మూడందాల స్త్రీ పునర్వివాహం శాస్త్ర సమ్మతమేనని ఆయన చూపవలసి వచ్చింది. వేదాల్లో ఆడవాళ్ళు చదువు కోడానికి సమర్థనం వున్నదయ్యా అని ఎవరైనా అంటే, అట్లా అయితే మేం మా ఆడ వాళ్ళకు చదువు చెప్పించం అంటారా ఎవరైనా!

వీరేశలింగంగారి అతి దుష్ట శత్రువులూ, పరమ క్రూర విరోధులూ కూడా, ఆ రోజుల్లోనే మోపలేని నిందను మోపడమే ఆయన శ్రుతి స్మృతులను పట్టుకొని తల కిందులుగా తపస్సు చేశాడనడం. ఇంత కన్నా అనౌచిత్యం ఇంకొకటి ఉండదు. ఇటీవల సాహిత్య వివాదాలలో ఇంత కన్నా ఘోరమైన, అసత్యమైన ప్రతిపాదనం, అసలు నిజానిజాలు తెలుసుకోకుండా దానికి కొందరు వంత పాట పాడడం జరిగి ఉండదు. జరగలేదనే అనుకుంటున్నాను, నా మట్టుకు నేను.

నూరేళ్ళు గడిచిన తర్వాత కూడా ఇవాళ అభ్యుదయ భావాలున్న వాళ్ళమంటూ చెప్పుకునే వాళ్ళు కూడా ఎంతగా సంప్రదాయ బద్ధులై ఉన్నారో ఆలోచించగల వాళ్ళకు తెలియక పోదు. సంప్రదాయ మంటే సామాజిక ప్రయోజనం కలిగి తరతరాలుగా అపరిహార్యమైన ఒక ఆచారం సంగతి కాదు ప్రస్తావించడం. ఎందుకో తెలీక పోయినా, ఆలోచన లేకుండానే ఆచరించడం సంగతి. సంధ్యావార్చక పోయినా జంధ్యం వేసుకోవడం మాననట్లు. ఇవి ఉండాలి వీళ్ళకు అని

నిర్దేశితమై ఉన్నవాళ్ళే నూటికి తొంబై తొమ్మిది, ఇంకా మించి కూడ 'పిలక' (శిఖ) వదిలేశారు. నూటికి తొంబై మంది జంధ్యం (యజ్ఞోపవీతం) వేసుకుంటున్నారు. వీటి మంచి చెడ్డలను కాని, వీటి విషయమై నమ్మకం ఉన్న వాళ్ళను హాస్యం చేయడం కాని, వాళ్ళకు నొప్పి కలిగించడం కాని ఉద్దేశం కాదు. ఇవాల్టికీ మన సంఘం స్థూలంగా గతానుగతమైన ఆచారబద్ధమయ్యే ఉంది కదా అని మీదృష్టికి తీసుకొని రావడమే. అభ్యుదయ భావుకులు కూడా కర్మకాండను, మూర్తి పూజను వదలలేదు. (మంచి చెడ్డల సంగతి కాదు. నేను నాస్తికుణ్ణీ కాను. వేంకటేశ్వరుడి పట్ల వైరభక్తి ఉన్నవాణ్ణీ కాను). మరి డెబ్బై రెండు సంవత్సరాల క్రితం యజ్ఞోపవీతం విసర్జించాడు వీరేశలింగం. (గురజాడ అప్పారావుగారు వీరేశలింగం కన్న గొప్పవాడనే వాళ్ళు రమణారెడ్డి గారు ఈ విషయమై ఏమన్నా బోగట్టా చేశారేమో కనుక్కుందురు గాక.)

ఇంకొక విషయం మనవి చేయాలి. వీరేశలింగానికీ గురజాడకీ, తులనాత్మక పరిశీలనం ఏమిటి? శ్రీ శ్రీ విశ్వనాథ శాస్త్రి కన్న తక్కువ రకం, లేదా తిట్ట దలుచుకుంటే తుక్క(వ?)కథలు రాస్తాడని ఘోషించడంలాగు. వీరేశలింగం కార్యక్షేత్రం వేరు. ఆయన పరిధి వేరు. ఆయన మూర్తిమంతం వేరు. ఆయన మహత్వం వేరు. వీరేశలింగం 1910 వ సంవత్సరానికి ఇంచు మించుగా ఉడిగి పోయినాడు. కృతజ్ఞత లేకపోగా కృతఘ్నత మాత్రం కావలసినంత కనపరుస్తూ వీరేశలింగం పై తెలుగువాళ్ళు ఆనాడే అపవాదులు ప్రచారం చేశారు. 1910 లో కథకుడుగా పుట్టినవాడు గురజాడ అప్పారావు. కన్యాశుల్కం రెండో ముద్రణంలో వ్యవహారికానికి పట్టం కట్టినవాడు. వీరేశలింగం కన్న గురజాడ గొప్ప శిల్పి. ఫలాని వారికన్న ఇంకో ఫలానివారు గొప్పశిల్పి అన్నంత మాత్రాన వొరిగే దేమిటి. వీరేశలింగం మెట్రిక్యులేటే. గురజాడ. బియ్యే కూడా. కుతర్కమూ వితండవాదమూ, గురజాడ గొప్పతనాన్ని భంగంచేయడంలోనూ ప్రవేశ పెట్టవచ్చు. ఉదాహరణ కావాలంటే పాషాణ హృదయుడికైనా కన్నీరు తెప్పించే పూర్ణమ్మ కథలో దుర్గ గుడి ప్రసక్తి ఎందుకు? పూర్ణమ్మ కళ్ళను కలువలతో పోల్చడం అరిగి పోయిన కవి సమయం కాదా. దుర్గను చేరెను పూర్ణమ్మ అనడం ఏం బాగుంది! ఇత్యాదయః. ఇంకా అతి తెలివికి పోతే 'నరుల చెమటను తడిసి మూలం ధనం పంటలు పండ వలెనోయ్' – మూల మంటే దేశమనియెడి దొడ్డ వృక్షం మూలమా – వైరములు వాణిజ్యమందే – పెట్టుబడిదారీ వ్యవస్థ లోని పోటీ వాసనకొడుతూంది. "దేవుళ్ళారా మీ పేరేమిటి" కథ రాసిన గురజాడ 'దుర్గ గుడి' ప్రస్తావన తేకుండా వుండాల్సింది – గురజాడ బొట్టు పెట్టుకోవడం చాలా తప్పు. ఆయన తన పిల్లలకు తన శాఖలోనే వివాహాలు చేశాడా? – ఇదంతా విమర్శ కిందనే లెక్కా?

రామాయణంలోని పిడకల వేట లాగా గురజాడను తీసుకొని రావడం తప్పే ఇక్కడ.

1919 వ సంవత్సరంలో వీరేశలింగం చనిపోవటానికి మూణ్ణెల్ల ముందు

ఆయన వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజానికి అధ్యక్షుడుగా వుండటానికి వొప్పుకున్నాడు. వాడుక భాషనే రాయాలి అన్నది ఆ సమాజం ధ్యేయం. గిడుగు రామ్మూర్తి సేకరించిన ప్రయోగాలన్నిటిని ఉపయోగించి వీరేశలింగం వ్యాకరణం రాయడం కూడా ఆ సమాజంవారి లక్ష్యాలలో ఒకటి. దాని కనుగుణంగా నవ్యాంధ్ర వ్యాకరణం — అని మొదలుపెట్టి ఐదారు పుటల నోట్సు రాసుకున్నాడు వీరేశలింగం. అందులో మొదటి వాక్యం ఏమిటో మీకు తెలుసా? "కవిత్వము ద్వివిధము. సశృంఖలము విశృంఖలమూ" అనీ. విశృంఖల కవిత్వమంటే వచన కవిత్వాన్ని ఆనాడే ఆయన క్రాంత దర్శిలాగా ప్రతిపాదించాడనుకుందామా! ముది మది తప్పిన చాదస్తంతో ఏదో రాశాడంటారా? తన జీవితమంతా ప్రయోగాలతో, సంఘర్షణలతో పోరాటాలు సాగించిన వీరేశలింగానికి మరోక రచయితకు పోలికేమిటి? ఇవాళ చదువుతున్నా ఆయన వచన రచనలు సరళమైన శైలిలోనే కనపడతాయి కాని అన్వయ కాఠిన్యం, పాండిత్య ప్రదర్శనం కనపడవే. కాకపోతే కాస్త పొడుగాటి వాక్యాలూ, అమాయకమైన నిష్కల్మషమైన తర్కం, ముడి సరుకు అనిపించే భావాలూ అక్కడక్కడా కనపడితే కనపడతాయిగాక: అంతమాత్రం చేత ఆయన్ను గొప్ప రచయిత కాదనడం న్యాయమా? భావ్యమా? వాడుక బాషకు వికాసం కలిగిస్తూ దాన్ని పఠన పాఠన యోగ్యమూ, సమర్థమూ చేయాలన్న సాహిత్య సంస్థకు వీరేశలింగం అధ్యక్షుడూ, రామ్మూర్తి కార్యదర్శి కావడంలోనే వీరేశలింగం ఆధునిక దృక్పథం సువాసించడం లేదా?

డెబ్బై సంవత్సరాల జీవిత కాలంలో నిరంతరం వెన్నంటి తరిమే అనారోగ్యమూ, సంస్థలు స్థాపించడంతోనూ, సంస్కరణ కార్యక్రమాలతోనూ ఉత్పన్నమైన సమస్యలతోనూ ఆయన సతమతమైనాడు. ఒక్క క్షణం విశ్రాంతి లేదు. రాసింది రెండోసారి రాయడం లేదు. అటువంటప్పుడు ఫలాని వారి పాండిత్యం, శిల్పం ఈయనకు లేదనడం సబబు కాదు. వెనకటికి కొందరు గురజాడను అకవి బిరుద పాత్రుణ్ణి చేయడంలో ప్రదర్శించిన అనౌచిత్యం కంటే ఎన్నోరెట్లు అవివేకాన్ని ప్రదర్శించడం వీరేశలింగాన్ని అధమ రచయిత అనడం. కన్యాశుల్కం గొప్ప రచన కావచ్చు. తిర్యగ్విద్వన్మహా సభ కూడా గొప్ప రచనే అంటాను నేను. బ్రాహ్మ వివాహం, వ్యవహార ధర్మబోధిని, కనీసం ఇరవైయ్యేళ్ళ కన్నా ముందే, గురజాడ కన్యాశుల్కం రాయడానికి ముందే వీరేశలింగం రాశాడు. అవి మంచి రచనలు కావా! ఎందుక్కావు? పైన వాడు భాషలో కూడ రాశాడు.

గిడుగు రామ్మూర్తి కూడ నిజమైన సంప్రదాయం వాడుక భాష రాయడమే అన్నాడని — ఆయన్ను తిరోగమనవాది అందామా? వెనకటి మతఃబులూ దస్తావేజులూ, కవిలెకట్టలు, స్థానికగాధలూ, శాసనాలూ, సాక్ష్యంగా తెచ్చాడు కదా — అట్లానే శ్రుతి, స్మృతులు వీరేశలింగం ఒప్పుకున్నాడనుకో కూడదా? అదిన్నీ హేతువాదమూ, మానవానుభవమూ, అభ్యుదయమూ భంగం కానంతవరకే.

పురుష సూక్తాన్ని ఆయన ప్రక్షిప్తం అన్నాడు. అది చెప్పే అవయవార్థం ఆయన వొప్పుకోలేదు.

ఆయన రాసిన రాజశేఖర చరిత్ర ఏమైపోయింది? కవుల చరిత ఏమైపోయింది? విజ్ఞాన శాస్త్రాలన్నీ ఏమైపోయినాయి? మార్గదర్శకత్వం ఏమైపోయింది? గొప్ప త్యాగమంతా ఏ గంగలో కలిసింది? ఆయన సుడివాదాన్ని, పిడివాదాన్ని, అస్తిత్వవాదాన్ని, ఇంకో చట్టుబండల వాదాన్ని ఎరగడనడంతో ఆయన ఆధునిక భావాలు లేనివాడు కావలసిందేనా? ఆయన గ్రాంధికం రాయడం నేరమేమీ కాదు. నవ్యులు కనీసం ఆయనలా అర్థమయ్యేట్లు కూడా రాయడం లేదు కొందరు. విగ్రపీగడం తప్ప. ఇట్లా అంటే గ్రాంధికం సమర్థించడంగా పొరపాటు పడ గూడదు.

నూరేళ్ళ వెనుక ఏ పరిస్థితులున్నాయో, ఆ పరిస్థితులలో తరతరాలుగా వేళ్ళు తన్ని ఉన్న దురాచారాలను, అంధ విశ్వాసాలను పెకలించివేసే ప్రయత్నం ఆయన ఏ విధంగా చేశాడో, ఎంతవరకు తకృత్యుడైనాడో, ఆ ప్రయత్నంలో సాహిత్యాన్ని ఏ విధంగా సాధనం చేసుకున్నాడో, ఆ సాహిత్యంలో అందచందాలు అసలేమైన ఉన్నాయో లేవో నిర్మమంగా, ఆవేశరహితంగా అంచనా వేయాలి. అదీ సబబు.

అసలు తెలుగు సాహిత్యంలో లౌకిక దృక్పథం ప్రవేశపెట్టిన వాడు వీరేశలింగమే కదా. ఇంచుమించు తొమ్మిది వందల సంవత్సరాలుగా, వచనం కాని, పద్యంకాని, యక్షగానంకాని, జానపదంకాని, భారతరామాయణాలు, పురాణాలు, ఇతిహాసాల నుంచి మాత్రమే స్వీకరిస్తూ వచ్చిన ఇతివృత్త స్వీకరణం మార్చి వేసిందెవరు? రాజశేఖ చరిత్రం, పెద్దయ్యగారి పెండ్లి పుస్తకం, ప్లీడరు నాటకం, సత్యవతీ చరిత్రం తెచ్చిందెవరు? వాదానికి పాల్కురికి సోమన బసవ పురాణం కథలున్నాయి గదా అంటారేమో. అవి చూడా దివ్యగాధలే కదా. ప్రత్యక్షాలూ, వరాలూ ఇత్యాది. కేవలం భూమిమీద సంచరిస్తూ, పుట్టిగిట్టే, మనుషులను సాహిత్యంలోకి తెచ్చింది వీరేశలింగమే. ఇది కూడా ఆయన గొప్పతనం కాక పోతుందా?

ఇక వీరేశలింగం స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొలేదనే అపవాదు ఒకటి వుంది. ఇవాల్టి ఘనుల్లాగా కాదు. ఆ రోజులో ఇంగ్లీషువాళ్ళ నాయన తీవ్రంగా విమర్శించాడు. అవసరం వచ్చిన చోట్ల తప్పులు తప్పులని స్పష్టంగా చెప్పాడు. ఆయన ఇంకా ఇరవై ఏళ్ళు ఆగి పుట్టక పోయినాడా అంటే ఎంత సొగసుగా వుంటుందో, బ్రిటిషువాళ్ళను స్వాతంత్రంకోసం ఖండించ లేదనడమూ అంతేగా ఉంటుంది.

వీరేశలింగానికి ఎవరూ వకాల్తా తీసుకోవల్సిన పనిలేదు. అయితే ఒకచోట ఆయన రాసినట్లు, విద్యాధికులు సత్యాన్ని అంగీకరించడం, అసత్యం నిరాకరించడం నేర్చుకుంటేనే దేశానికి మేలు అంటూ జరుగుతుంది.

ఈ అభిప్రాయాలను ఇంతకన్నా హేతుబద్ధంగానూ, వినయంగానూ, సంక్షేపంగానూ, సూటిగానూ, శాంతంగానూ చెప్పలేక పోయిన నా అశక్తతకు విచారిస్తున్నాను, సిగ్గుపడుతున్నాను.

కథానిక హిందీ

# భోలారాముడి ప్రాణం

హరిశంకర్ పరసాయీ

తెలుగు : వై. వి. యస్. యన్. యన్. మూర్తి

ఇలా ఎప్పుడూ జరగలేదు. యమ ధర్మరాజు లక్షలాది సంవత్సరాల నుండి అసంఖ్యాకులైన మానవులకు వారి వారి కర్మలను బట్టి స్వర్గ నరకాల్లో నివాస స్థలాన్ని కేటాయిస్తూ వస్తున్నాడు. కాని ఎప్పుడూ ఇలా జరగలేదు.

ఎదురుగా కూర్చున్న చిత్రగుప్తుడు మాటి మాటికి కంటి అద్దాలను తుడుచుకుంటూ, మాటి మాటికి ఉమ్మి తడి చేసుకుంటూ రిజిష్టరులో ప్రతీ పేజీ తిప్పుతున్నాడు, కాని తప్పు దొరకలేదు. చివరకు ప్రాణం విసిగి దబాల్ మని రిజిష్టరు మూసేసాడు. ఆ వేగానికి ఆ రిజిష్టరులో ఎప్పుడో చచ్చి పడి వున్న ఈగ ఎగిరి బయట పడింది. దాన్ని తీసివేస్తూ — "ప్రభూ! రికార్డు సరిగ్గా ఉంది. భోలా రాముడి ప్రాణం 5 రోజుల క్రితం శరీరాన్ని విడిచింది. యమదూతతో కలిసి యమలోకానికి ఆనాడే బయలుదేరింది, కాని ఇంత వరకూ ఇక్కడకు చేరలేదు."

"ఆ దూత ఎక్కడ?" అని అడిగాడు ధర్మరాజు.

"అతడి జాడా తెలియడం లేదు ప్రభూ!" అన్నాడు జవాబుగా చిత్రగుప్తుడు.

యమదూత అదే సమయంలో ఆదరా బాదరాగా తెరిచి వున్న ద్వారం గుండా లోపల ప్రవేశించాడు. అసలే అతడు కురూపి, పైగా శ్రమ, అలసట, దుఃఖం, భయం కారణంగా ముఖం మరింత వికారంగా ఉంది. దూతను చూస్తూనే చిత్రగుప్తుడు కోపంగా అరిచాడు — "నువ్వు ఇన్నాళ్ళూ ఎక్కడున్నావ్? భోలా రాముడి ప్రాణం ఎక్కడ?"

"దయా నిధీ! ఏమయిందో ఎలా చెప్పేది? ఇంత వరకూ నా సర్వీసులో నేను మోసగించబడ లేదు, కాని భోలారాముడి ప్రాణం నన్ను మోసగించింది. ఐదు రోజుల క్రిందట భోలా రాముడి ప్రాణం శరీరాన్ని విడిచింది. ఆ ప్రాణాన్ని తీసుకొని యమలోకానికి బయలుదేరాను. నగరాన్ని దాటి ప్రచండ వాయుతరంగా లెక్కి యమలోకపు దిశగా వస్తుండగా అకస్మాత్తుగా నా గుప్పిటి నుండి తప్పించుకొని భోలారాముడి ప్రాణం మాయం అయ్యింది. ఈ ఐదు రోజులూ బ్రహ్మాండమంతా వెదికాను కాని దొరకలేదు" అన్నాడు దూత వినయంగా.

ధర్మరాజు కోపంగా "మూర్ఖుడా! జీవులను తెస్తూ తెస్తూ ముసలి అయిపోయావు; కాని నిన్ను ఒక మామూలు మనుష్యుడి ప్రాణం మోసగించిందా?" అన్నాడు.

దూత తలవంచుకొని — "ప్రభూ! నా జాగ్రత్తలో లోపం ఏమీలేదు. నా చేతుల్లో నుండి కొమ్ములు తిరిగిన వకీళ్ళు

సైతం తప్పించుకో లేక పోయారు. ఇదేదో ఇంద్రజాలంలా ఉంది'' అన్నాడు వినయంగా.

''ప్రభూ! ఈ రోజుల్లో భూలోకంలో ఇలాంటి సంఘటన లెన్నో జరుగుతున్నాయి. ప్రజలు తమ మిత్రులకు, బంధువులకు పంపే పార్సిల్స్‌ను రైల్వే వాళ్ళు మధ్యలోనే కాజేస్తున్నారు. గూడ్సు రైళ్ళలో వేగన్లకు వేగన్లే మాయమవుతున్నాయి మధ్యలో. అంతే కాక రాజకీయ నాయకులు ప్రతి పక్షం వారిని రాత్రికి రాత్రే మాయంచేసి దాచేస్తున్నారు, బహుశా భోలారాముడి ప్రాణాన్ని శత్రువులెవరైనా అపహరించి వుంటారు'' అన్నాడు చిత్రగుప్తుడు.

''నువ్వు రిటయిర్ కావల్సిన వయస్సు వచ్చింది. అందుకే బుద్ధి మందగించింది. భోలారాముడి వంటి దరిద్రుడితో, అనామకుడితో ఎవరికి మాత్రం ఏం పని వుంటుంది'' అన్నాడు వ్యంగ్యంగా చిత్రగుప్తుడ్ని చూస్తూ ధర్మరాజు.

ఇంతలో నారదుడు ప్రవేశించాడు. బిగుసుకు పోయినట్లున్న వాతావరణాన్ని చూసి, అందులో గంభీరంగా ఆలోచనలో మునిగిన ధర్మరాజు నుద్దేశించి – ''ఏం ధర్మరాజా! అంత విచారంగా ఉన్నావు? నరకంలో వసతి సమస్య తీరలేదా?'' అన్నాడు.

''ఆ సమస్య ఎప్పుడో పరిష్కారమయిపోయింది. గడచిన సంవత్సరాల్లో మంచి మంచి పనివాళ్ళు వచ్చారు నరకానికి. పెద్ద పెద్ద కట్టడాల్ని కట్టించి ధనం ఉగ్గమింగిన కంట్రాక్టర్లు, వీళ్ళతో చేతులుకలిపి పంచవర్ష ప్రణాళికల ధనం కాజేసిన ఇంజినీర్లు, లేని కూలీల పేరు మీద కూలీ డబ్బు కాజేసిన ఓవర్‌సీర్లు, ఇలా ఎందరో నరకానికి వచ్చారు. వాళ్ళంతా చేరి తొందరలోనే ఎన్నో కట్టడాలు నిర్మించారు. ఇప్పుడు వసతి సమస్య లేదు, కాని పెద్దచిక్కు సమస్య వచ్చి పడింది. భోలారాముడు అనే వ్యక్తి ఐదు రోజుల క్రితం చనిపోయాడు. అతడి ప్రాణాన్ని దూత తెస్తూండగా, అది దూతను మోసగించి దారిలో ఎక్కడో మాయమయింది. దూత ప్రపంచమంతా వెదికాడు కాని అతడి ప్రాణం జాడలేదు. ఇక ఇటువంటి సంఘటనలు మరికొన్ని జరిగాయంటే పాప పుణ్యాల భేదం నశించిపోతుంది'' అన్నాడు ధర్మరాజు విచారంగా.

''అతడికి ఇన్‌కంటాక్స్ బకాయి ఉందేమో! బహుశా వాళ్ళే అప్పగించి ఉండొచ్చు'' అన్నాడు నారదుడు సాలోచనగా.

''అసలు ఇన్‌కమ్ ఉంటేకదా టాక్స్ ఉండేందుకు. అతడు అన్నార్తుడు'' అన్నాడు చిత్రగుప్తుడు.

''విషయం చాలా గమ్మత్తుగా ఉంది. నేను భూలోకానికి వెళ్తూన్నాను. అతడి అడ్రసు ఇవ్వండి, కనుక్కుంటానా విషయం'' అన్నాడు నారదుడు.

చిత్రగుప్తుడు రిజిష్టరు తెరచి ''అతడి పేరు భోలారాముడు. జబల్‌పూర్, ఘమాపూర్ వీధి కాలువ దగ్గర ఒకటిన్నర గదిలో కుటుంబంతో కాపురం ఉండేవాడు – వయస్సు రమారమి 60 సంవత్సరాలు. భార్యా, ఇద్దరు కొడుకులు, ఒక కూతురు ఉన్నారు. గవర్నమెంటు ఉద్యోగం చేసేవాడు రిటయిర్ అయి ఐదేళ్ళు అయింది. ఇంటికి ఒక సంవత్సరంనుండి అద్దె ఇవ్వలేదు. అందుకని ఇంటి యజమాని అతడ్ని ఇల్లుఖాళీ

చేయించాలను కుంటున్నాడు. ఇంతలో చనిపోయాడు. బహుశా ఈ సరికి ఇంటి యజమాని వాళ్ళను కాళీ చేయించి ఉంటాడు. చేయిస్తే వాళ్ళకోసం మీరు. కొంచెం శ్రమపడి వెదకాల్సివుంటుంది'' అని పూర్తి సమాచారం తెలియ జేశాడు.

★ ★ ★

తల్లీ కూతుళ్ళ ఏడ్పును బట్టి భోలా రాముడి ఇల్లు సులువుగా కనుక్కో గలిగాడు నారదుడు. ద్వారం దగ్గరకు వెళ్ళి ''నారాయణ!'' అన్నాడు నారదుడు. కూతురు చూసి ''అలా వెళ్ళండి స్వామీ!'' అంది.

''నేను భిక్షకు రాలేదు. భోలా రాముడి గూర్చి తెలుసుకొనేందుకు వచ్చాను. మీ తల్లిగారిని పంపు తల్లీ !'' అన్నాడు నారదుడు.

భోలా రాముడి భార్య బయటకు వచ్చింది.

''తల్లీ! భోలా రాముడికి ఏమిటి సుస్తీ ?'' అన్నాడు నారదుడు.

''ఏం చెప్పేది? దరిద్రమే జబ్బు. ఐదేళ్ళు అయింది రిటైరై. ఇంతవరకూ పెన్షన్ రాలేదు. ప్రతీ పది – పదిహేను రోజుల కొక్కసారి దరఖాస్తుపై దరఖాస్తు పెట్టేవారు. జవాబు వచ్చేదికాదు. వచ్చినా, 'మీ విషయమై విచారణ జరుగు తుంది' అని ఉండేది. ఈ ఐదేళ్ళూ ఇంట్లోని నగా నట్రా, చెంబు, పాత్రలూ అమ్ముకు తిన్నాం. ఇంకేం మిగల్లేదు. పస్తుల పాలయ్యాం. ఆ విచారంతో కృంగి కృశించి, ఆకలితో మాడుతూ ప్రాణం విడిచారు ఆయన'' అంది ఆమె.

''ఏం చేస్తాం మమ్మా! అతడికి వయస్సు అయిపోయింది'' అన్నాడు నారదుడు సానుభూతిగా.

''అలా అనవద్దు స్వామీ! ఏమంత వయస్సు అయిపోయింది ? 50 – 60 రూపాయల పెన్షన్ వస్తే, మరొక పని చేసి మరికొంత డబ్బు సంపాదించు కుంటే మా రోజులు గడిచిపోయేవి. కాని ఏంచేయడం ? ఐదేళ్ళయి పని నుండి నిలిచి పోయారు. కానింత వరకూ ఒక్క గవ్వకూడా దొరక లేదు ప్రభుత్వం నుండి.''

నారదుడికే దుఃఖమయమైన కథ వినాలనిపించ లేదు. తన ధోరణి లోనికి వచ్చి ''అమ్మా ! భోలారాముడికి ఎవరి మీదనైనా విశేషమైన ప్రేమ ఉందా?'' అని అడిగాడు.

''పిల్లలంటే అమితమైన ప్రేమ'' అంది ఆమె.

''కాదు, కుటుంబ వ్యక్తులపైని కాక మరెవరిపైనైనా ఉండొచ్చు కదా ! నా ఉద్దేశ్యం ఏ స్త్రీ మీదైనా. ...'' అన్న నారదుని మాట పూర్తికాలేదు. ఆమె నారదుని వంక క్రోధంగా చూసింది. ''నోటికొచ్చినట్టు మాట్లాడకండి. మీరు సాధు పురుషులే గాని, అలగా మనుష్యులు కాదు : మీరిలా మాట్లాడడం సమంజసంగా లేదు. జీవితంలో ఆయన మరొక స్త్రీ వంక కన్నెత్తి చూసి ఎరుగరు.''

నారదుడు నవ్వి ''నీ మాట సత్యం తల్లీ! ఆదర్శ వంతుడైన గృహస్థుని లక్షణం అది. మంచిది తల్లీ! వస్తాను'' అన్నాడు నారదుడు సెలవు తీసు కుంటూ.

''స్వామీ! తమరు సిద్ధ పురుషులు. ఆయన పెన్షన్ వచ్చేలా కనికరించండి. ఈ పసివాళ్ళ కడుపు నిండుతుంది'' అంది ఆమె చేతులు జోడించి.

ఆమె మీద నారదునికి ఎంతో దయ

కలగంద. "ఈ రోజుల్లో సాధువుల మాట ఎవరు వింటారు. కనీసం నా కొక మతమయినా లేదు. అయినా ప్రభుత్వ కార్యాలయంకు వెళ్ళి ప్రయత్నం చేస్తాను" అన్నాడు నారదుడు మాట ఇస్తూ.

అక్కడి నుండి తిన్నగా నారదుడు పెన్షన్ విభాగంకు సంబంధించిన ఆఫీసుకు వెళ్ళాడు. అక్కడ మొదటి గదిలో కూర్చున్న గుమస్తాతో భోలా రాముడి కేసు వృత్తాంతమంతా మాట్లాడాడు. అతడంతా ధ్యాన పూర్వకంగా విని "భోలా రాముడు చాలా దరఖాస్తులయితే పంపించాడు కాని, వాటి మీద బరువు పెట్టడం మరచిపోయాడు. అవి ఎగిరి పోయి ఉంటాయి" అన్నాడు.

"ఇక్కడెన్నో పేపర్ వెయిట్స్ ఉండగా, వీటినెందుకు పెట్టలేకపోయారు?" అన్నాడు నారదుడు ఆశ్చర్యంగా.

ఆ వ్యక్తి నవ్వి "మీరు సాధు పురుషులు. లోకరీతిని అర్థం చేసుకోలేరు. దరఖాస్తులు ఈ పేపర్ వెయిట్ పెట్టినంత మాత్రాన ఎగరకుండా ఉండిపోవు. అయినా నాకెందుకు లోపల హెడ్ గుమస్తా గారున్నారు, వెళ్లి చూడండి" అని ఫైల్‌లోకి తలదించుకున్నాడు.

నారదుడు హెడ్ గుమస్తా దగ్గరకు వెళ్ళాడు, అక్కడనుండి మేనేజరు దగ్గరకు వెళ్ళేడు, అక్కడ నుండి సహాయాధికారి దగ్గరకు వెళ్ళేడు. అక్కడా పని జరగలేదు.

నారదుని అవస్థ చూసి అక్కడున్న హెడ్ ప్యూన్ -

"స్వామీ! సంవత్సరం పొడుగునా వీళ్ళ చుట్టూ తిరిగినా పని కాదు. తమరు తిన్నగా పెద్ద అయ్యగారిని చూడండి. ఆయన్ని సంతోష పెట్టారా నిమిషంలో మీ పని అయిపోతుంది" అని సలహా యిచ్చాడు.

కృతజ్ఞతగా అతడి వంక చూసి నారదుడు ఆఫీసరు గారి గదిలో ప్రవేశించాడు. బయట కునికి పాట్లు పడుతున్న దర్వాను నారదుడిని గమనించ లేదు. విజిటింగ్ కార్డు ముందుగా లోపలకు పంపకుండా ప్రవేశించినందుకు ఆఫీసరు కళ్ళెర్ర చేస్తూ ఎగిరి పడ్డాడు. కోపంగా "ఇదే మయినా దేవాలయం అనుకున్నావా? తిన్నగా లోపలికి వచ్చేశావు! చీటీ ఎందుకు ముందుగా పంపలేదు?" అన్నాడు ఆఫీసరు.

"ఎలా పంపేది, ప్యూను నిద్రపోతుంటే?" అన్నాడు నారదుడు.

"ఏం పని" అన్నాడు దర్పంగా ఆఫీసరు. నారదుడు భోలా రాముడి పెన్షన్ విషయం చెప్పాడు.

"మీరు చూస్తే బైరాగి. ఆఫీసుల పద్ధతులు ఏ మాత్రం తెలియవు. నిజానికి భోలారాముడే తప్పు చేశాడు. ఇదీ ఒక పూజా మందిరమే. ఇక్కడా దాన ధర్మాలు చేయవలసి ఉంటుంది. మీరు భోలా రాముడికి చాలా ఆత్మీయుల్లా కన్పడుతున్నారు. అతడి దరఖాస్తులు ఎగిరి పోతున్నాయి. వాటి మీద బరువు ఏదయినా పెట్టండి" అన్నాడు ఆఫీసరు.

నారదుడు ఆలోచనలో పడ్డాడు. ఇక్కడ కూడా బరువు సమస్యే వచ్చింది మరి.

"అయ్యా! ఇది ప్రభుత్వ ధనానికి సంబంధించిన విషయం. పెన్షన్ కేసు.

ఠమారమి ఇరవై ఆఫీసుల చుట్టూ తిరగాల్సి ఉంటుంది. అందుకు చాలా అలస్య మవుతుంది. ఇరవై సార్లు ఇరవై చోట్ల ఒకే విషయం వ్రాయాల్సి ఉం టుంది. అప్పుడే నిర్ధారణ అవుతుంది. ఎంత పెన్షన్ వస్తుందో, అంత స్టేషనరీ ఖర్చు కావల్సి ఉంటుంది. ఈ పని తొం దరగా కూడా ముగించవచ్చు. కానీ - - '' అని ఆఫీసరు ఆగి పోయాడు.

'అంటే ?'' అని నారదుడు అడిగాడు.

చిరునవ్వు ముఖం మీద పులు ముకొని ''కాని బరువు కావాలి. తమరు గ్రహించ లేదు. మీ అందమైన వీణను సైతం బరువుగా భోలా రాముడి దరఖాస్తుల పైని పెట్ట వచ్చు. నా కూతురు సంగీతం నేర్చుకోవాలని అనుకుంటుంది. దీన్ని ఆమెకిస్తాను. సాధు పురుషుల వీణలు చక్కగా స్వరాలు పలుకుతాయి అని విన్నాను '' అన్నాడు ఆఫీసరు.

నారదుడు తన వీణ విషయం ఆఫీసరు నోటి నుండి వినే సరికి కంగారు పడిపోయాడు. ఒక క్షణం ఆలోచించి, వీణను టేబులు పై ఉంచి ''తీసుకోండి కొంచెం త్వరగా అతడి పెన్షన్ ఆర్డరు వేయించండి'' అన్నాడు చేసేది లేక నారదుడు.

ఆఫీసరుగారి ముఖం మతాబులా వెలిగిపోయింది. ప్రసన్నంగా నారదుని కూర్చోమని కుర్చీ చూపించాడు. వీణను ఒక ప్రక్క పెట్టి, కాలింగ్ బెల్ నొక్కేడు. ప్యూన్ లోపలకు వచ్చాడు.

''హెడ్ గుమస్తా గార్ని అడిగి భోలా రాముడి పెన్షన్ ఫైలు తీసుకురా '' అని హుకుం జారీ చేసాడు అఫీసరు. కొంత సేపు తరువాత 100-150 దర ఖాస్తులతో నిండిన భోలా రాముడి ఫైలు తీసుకొచ్చాడు ప్యూన్. అందులో పెన్షన్ కాగితాలు కూడా ఉన్నాయి. ఆఫీసరు ఫైలు మీద ఉన్న పేరు చదివాడు. కాని నిర్ధారణ చేసుకొనేందుకు ''స్వామీ! పేరేమిటన్నారు ?'' అన్నాడు.

అఫీసరుకు మామూలుగా విన్పిం చదు కాబోలు అని గట్టిగా ''భోలా రాముడు!'' అని చెప్పాడు.

'ఎవరు ? నన్ను పిలుస్తున్నారు, పోస్ట్‌మేనా ? పెన్షన్ ఆర్డరు వచ్చే సిందా?'' అన్న గొంతు అకస్మాత్తుగా ఫైలు మధ్యనుండి వినపడింది.

నారదుడు ఉలిక్కి పడ్డాడు. మరు క్షణంలో విషయాన్ని అర్థం చేసు కున్నాడు.

''భోలారామ్! నువ్వు భోలా రాముడి ప్రాణానివా ?'' అని అడి గాడు నారదుడు.

''అవును'' అని జవాబు వచ్చింది.

''నేను నారదుడ్ని, నిన్ను తీసుకొని వెళ్ళడానికి వచ్చాను, పద. స్వర్గంలో నీకోసం తగిన ఏర్పాట్లు జరిగాయి'' అన్నాడు నారదుడు.

''నేను రాను. నేను పెన్షన్ కాగి తాలను అంటి పెట్టు కున్నాను. నాకి క్కడే బాగుంది. నా దరఖాస్తులను వదలి ఎక్కడికీ రాలేను'' అన్న గొంతు వినిపించింది దృఢంగా.

కాగితమూ, కలమూ నా దగ్గర్నుంచి లాక్కొని పోయినా యిబ్బందేమీ లేదు - నా గుండె నెత్తురులో నా వేళ్లు ముంచాను కాబట్టి. (పాకిస్తాన్ కవి ఫయిజ్ అహ్మద్ ఫయిజ్)

# మమ దేహి కరావలంబం

వి. ఎల్. ఎస్. ఆచార్యులు

నిదానంగా సింగారాల ముగ్గుల్ని ముంగిలిలోంచే స్వయంగా
వేసుకొస్తున్నాను.
నీడనిచ్చే చెట్టూ నీళ్ళనిచ్చే చెరువూ కరువైనా
మిట్టపల్లాలూ వూబి గోతులూ ఎదురైనా
నిటారుగా నా బాటని నేనే వేసుకొస్తున్నాను
కత్తిపదును మొక్కల్ని బ్రహ్మచెవుడు డొంకల్ని ఎక్కడికక్కడ
నరుక్కొస్తున్నాను.

శిఖరారోహణ చరమధ్యేయంగా ప్రకృతి వీక్షణ పరమలక్ష్యంగా
నేను ఏనాడో ప్రారంభించేను – ఈ ప్రయాణాన్ని! ఈ ప్రస్థానాన్ని!

సుడిగాడ్పుల్లో వుక్కిరి బిక్కిరై దిక్కుతోచని ఘడియలలో
నా వెన్ను నేనే తట్టుకొని-మనస్సాక్షిగా కర్మసాక్షి వెలుగులో సాగివొచ్చేను.
ఏ చల్లని మావి నీడా ఏ నల్లని రాతి మేడా
నాకక్కరలేదని మొరాయించుకు మరీ చక్కా వొచ్చే నిక్కడికి.

తీరా - ఈ కొండచరియ చేరేసరికల్లా
నన్నెదుర్కొంది - కలుషిత వాతావరణం!
కెరడు కట్టిన అడుసు తెట్టెపై చితపితమని పడే పాకుడు బొట్లు
పైపై మెట్లమీంచి అదును దొరికిన చోటల్లా
పరుచుకు పోయి ప్రాకులాడే గొంగళీలూ,
నడిమి నడిమిగా నడుము లాడించే గాజు పురుగులూను.

నన్ను లోగొన చూచే ఈ గాలికి నన్ను దిగజార్చచూచే ఈ వూబికి
నన్ను ముంచెత్త చూచే ఈ ధూళికి - నేను
కొట్టుకు పోతున్నాను - నిలద్రొక్కుకోలేక పోతున్నాను -
తట్టుకోలేక పోతున్నాను.
గజిబిజిగా అల్లుకొని వున్న ఉత్తరేణి విత్తులు
జిగటు జిగటుగా పట్టుకు వొదలడం లేదు.

ఇక గతిలేక వెనకడుగు వేయాలి - లేదా -
నా ఎట్ట ఎదుట నిట్టనిటారుగా 'కొలోసస్' లా కాళ్ళు పారజాపిన
ఈ కాల మేఘానికి —
'ఆక్టోపస్' లా నన్ను పొట్టబెట్టుకోబోతున్న ఈ

ఝుంఝూ ప్రభంజన కబంధ హస్తాలకి -
నేను తలవొగ్గక తప్పదు! నేను చిక్కక తప్పదు!
ఈ 'జెస్లర్ హేట్' కి నేను సెల్యూట్ కొట్టక తప్పదు!

బాధంతా వొక్కమాటుగా కుత్తికంటులో ముడిపడి కొట్టుకొంటోంది

అడ్డదార్లు తొక్కి అవలీలగా పైకొచ్చి సందు చూసుకు
సరసరా పైపై కెగబ్రాకి
పూసరవెల్లి విసిరింది నాపైకో చిరుదరహాసం!

నేను -

శృంగోపరిభాగాన శిలా సింహాసనంపై
కాలుమీద కాలు వేసుక్కూర్చుని మరీ చూడాలి - వోసారి తలెత్తి -
నా ఎదురుగ ఇంత కాలం తెల్లబారిన ఆశలన్నీ
చిత్రవిచిత్రంగా పరిణమిస్తుంటే!
అక్కణ్ణించి ఏరియల్ వ్యూలో రియల్ నేచర్ని తనివితీరా
పరికించాలి.
అక్కణ్ణించే నేనందుకోవాలి - నవోదయాల్ని, శుభోదయాల్ని!

చమ్కీ బుటేదారు పూల నీలి ముఖమల్ గొడుగు నా కోసమే అనీ;
నా కోసమే - నల్లని శాల్వా షేర్వాణీ సవరించుకు మరీ ఎవడో
చల్లని మారాజు బంగారు రజను చల్లుతున్నాడనీ - అనుకోవాలి!
ఆ చల్లని గాలీ ఆ చిక్కని వెలుగూ నా కోసమే అని
మురిసిపోవాలి!

అంచేత - నేను
కాన్వాస్ దొరకడంలేదని నా మనోచిత్రాన్ని మలినం
చేసుకో[లే]ను!
లోగిలి దక్కడం లేదని నా ముగ్గుల్ని కాలరాసుకో [లే]ను!

మరి! - అహాన్ని చంపుకొని ఇహాన్ని ఎంచుకొని
'నేను' సైతం నిన్ను -

చేతులు చాచి యాచిస్తున్నాను - ''హాత్ మే, హాత్ మిలావో మిల్ కర్
మదత్ కరో!''
కాళ్ళు ముడుచుకు అడుగుతున్నాను - ''గివెస్ట్ ది వియరీ
హేండ్!''
చేతులు జోడించి ప్రార్థిస్తున్నాను - ''మమ దేహి కరావలంబమ్!''

## ప్రేమలూ - పెళ్ళిళ్ళు

"రాజు!"

"ఊఁ..."

"ఈ రోజెంత హాయిగా వుంది రాజూ! మనకాలేజి జీవితం ఈ నాటితో ముగిసిపోతుందని తలచుకుంటే బాధగా వుంది. ఇలా ఒకరి వొడిలో వొకరం ప్రతి క్షణం హాయిగా గడపగలిగితే ఎంత బావుణ్ణు. రేపు నువ్వు మీ వూరికి, నేను మా వూరికీ వెళ్ళి పోతున్నాం. ఈ సుఖాన్ని ఈ ఆనందాన్ని శాశ్వతం చేసుకోవాలని నీ కనిపించటం లేదా రాజూ?"

"ఇప్పుడున్న సుఖంలోని ఆకర్షణ అప్పుడు తగ్గిపోతుందేమో."

"అదేం మాట రాజూ! ప్రేమించి పెళ్ళి చేసుకున్న వాళ్ళెవరూ సుఖంగా లేరంటావా? మనమధ్య ఆకర్షణ, అనురాగం ఎన్నటికీ చెరిగిపోదు రాజూ. ఆ నమ్మకం నాకుంది."

"సరే. అలాగే చేద్దాం".

"నువ్వెంత మంచివాడివి రాజూ! ఊరికి వెళ్ళిన వెంటనే మా నాన్నని ఒప్పిస్తాను, ఆయన నామాట కాదనరు."

"ఒక వేళ అంటే?"

"అప్పుడు నాన్ననీ, ఆస్తినీ అందర్నీ వదిలేసి నీతో వచ్చేస్తాను. నువ్వు లేకుండా నేను బతకలేను రాజూ. మీ అమ్మ కూడా మన పెళ్ళికి అభ్యంతరం చెప్పదనుకుంటాను. ఏమంటావు రాజూ?"

"చెప్పదు."

ఆమె అతని కౌగిట్లో గువ్వలా ఒదిగి పోయింది. అత నామెని తమకంగా ఆక్రమించుకున్నాడు.

మూడేళ్ళు గడిచి పోయాయి.

హైదరాబాదులో ఒక సినిమా హాలు ముందు ఆమె కనిపించింది.

"హల్లో రాజూ!" ముందు ఆమే పలకరించింది.

పక్కనే రెండేళ్ల పాప నెత్తుకొని దర్జాగా నిలబడి వున్న భర్తని పరిచయం చేసింది. దూరంగా పార్కుచేసివున్న తన పచ్చరంగు కారుని పరిచయం చేసింది.

ఎందుకో పాప ఏడుపు కెత్తుకుంది.

"దీనికి చాక్‌లెట్లేమైనా కొని తెస్తాను. ఇక్కడే వుండు" అంటూ పాప నెత్తుకుని అటువేపు వెళ్ళాడు భర్త.

"నన్ను క్షమించు రాజూ! మనం అనుకున్నవన్నీ తారు మారయినయ్. శుభలేఖ కూడా పంపలేక పోయాను. అనుకోకుండా జరిగిపోయింది నా పెళ్ళి."

"ఎవర్నీ ఎవరూ క్షమించుకో నక్కర్లేదు రాణీ. ఆవేశంలో అనుకునేవన్నీ ... అదుగో! బాబిగాడితో మా ఆవిడ కూడా దిగుతోంది రిక్షాలోంచి. వస్తాను" అంటూ గేటు వేపుకి వడి వడిగా అడుగులు వేశాడు రాజు.

## ప్రకృతి - వికృతి

"దేవుడున్నాడని నమ్ముతావా?"

"నమ్మను"

"ఏం. ఎందుకని?"

"నేనెప్పుడూ చూళ్ళేదు గనుక. కాని దయ్యాలున్నాయని మాత్రం ఒప్పుకుంటాను."

"అదెలాగ?"

"అసూయతో, ద్వేషంతో, స్వార్థంతో దయ్యాలై తిరుగుతున్న వాళ్ళని చూస్తున్నాను గనుక. తర తరాలుగా పదవీ వ్యామోహంతో మారణ హోమాలు సృష్టించే వాళ్ళనీ, బలహీనుల్ని పీడించే అమానుషుల్నీ, అమాయకుల్ని వంచించే కుట్రదారుల్నీ, మంచివాళ్ళని మతిభ్రష్టుల్ని చేస్తోన్న దుష్టదెయ్యాలనీ చూస్తున్నాను గనుక."

"అయితే నువ్వు దేవుణ్ణి నమ్ముతున్నా వన్నమాట"

"ఏమిటీ తల తిరుగుడు మాట?"

"చిన్నప్పుడు చదువుకున్న బాల వ్యాకరణం గుర్తుందను కుంటాను?"

"రామాయణంలో పిడకల వేటా?"

"ముందిది చెప్పు. వ్యాకరణం గుర్తుందా?"

"ఎంత కథలు వ్రాసే వాణ్ణయినా ఇంకా వ్యాకరణం మరచిపోలేదులే."

"అయితే విను. ముఖము: ప్రకృతి–మోము: వికృతి స్నేహము: ప్రకృతి–నెయ్యము: వికృతి దైవము: ప్రకృతి–దయ్యము: వికృతి. కావున దేవుడే దయ్యము. దయ్యమే దేవుడు. వాడే వీడు. వీడే వాడు.

"త్వమేవాహం."

---

# ఆర్మీనియన్ ప్రేమ గీతాలు

---

## ఆనందం

### పారియర్ మికాలియన్

ఆనందం బహుశా
కవిత్వం లాంటి దేమో,
ఊడిపడుతుంది హఠాత్తుగా
శూన్యంనుంచి సైతం.

కష్టమైన జీవితంలో
నేను దాటిన రహదారులెన్నో—
కాని అనంతంగా
నేనన్వేషిస్తోన్న ఆనందం
లభించిందీ వేళ
అనూహ్యంగా
నీవెచ్చని కౌగిలింతలో
ఈ సన్నని పుంత చెంత....

## మంచు కరిగిపోయింది

### మారీ మార్గరియన్

మంచు కరిగి పోయింది
మెత్తని, తియ్యని
నిట్టూర్పు తాకి—
అమూల్యమూ రాక
అ అదృశ్య నిశ్శబ్ద ఆర్ద్రత;
నా బ్రతుకు బాటపైని
కిరణంలా
నడుస్తోన్న దెవ్వరు?

(తెలుగు : మంగాదేవి)

# రచయిత పరిష్కారం చూపాలా?

## ఎంగెల్స్ అభిప్రాయం

పరిస్థితులు, సంఘటనల నుంచే లక్ష్యం అవగతం కావాలి కాని, స్పష్టంగా చెప్ప నక్కర్లేదు. తాను చిత్రించే సామాజిక సంఘర్షణల భావి చారిత్రక పరిష్కారాలను రచయిత పాఠకుని కందించ నక్కర్లేదు-అంటారు ఫ్రెడరిక్ ఎంగెల్స్, మిన్నా కాట్‌స్కీకి జాబు వ్రాస్తూ. నవ రచయితల వుపయోగం కోసం ఆ లేఖాభాగాన్ని ఇక్కడ ఇస్తున్నాము.

లండన్, నవంబరు 26, 1885

మిన్నాలో కాట్‌స్కీకి,

నీ "పాతవీ, కొత్తవీ" కూడా చదివేసేను. చాలా బాగుంది. స్టిఫాన్‌లో రైతుల జీవితాలను చిత్రించి నంత నైపుణ్యంతో ఉప్పు గని పనివారి జీవితం చిత్రించబడింది. అదే విధంగా వియన్నా నగరపు సామాజిక జీవన చిత్రణం కూడా, ఎక్కువ భాగం చాలా బాగుంది. సామాజిక జీవితం వున్న జర్మను నగరం ఒక్క వియన్నాయే; బెర్లిన్‌లో "కొన్ని స్పష్టమైన కూటాలూ", ఎన్నో అస్పష్టమైన కూటాలూ మాత్రమే వున్నాయి. అందుచేతనే అక్కడ విద్వాంసుల్ని గురించో, అధికారులూ, నటుల్ని గురించో మాత్రమే నవలలు వస్తున్నాయి. ఈ నీ రచనలో ఒకొక్కచోట కథా పరిణామం అతి వేగంగా వుందేమో నువ్వే చెప్పాలి. మనకి అభిప్రాయం కలిగిస్తున్న అనేక విషయాలు వియన్నాలో అతి సామాన్యంగా కనిపించవచ్చు. ఆ నగరానికి ఒక చిత్రమైన అంతర్జాతీయ స్వభావం వుంది. దక్షిణ యూరపు లక్షణాల, తూర్పు యూరపు లక్షణాల సమ్మిశ్రణం కనిపిస్తుంది.

నీ రచనలలో మామూలుగా కనిపించే అతి నిశితమైన వైయక్తికత ఈ రెండు విషయాలలోనూ కూడా పాత్రలతో కనిపిస్తుంది. అవి ఒక్కొక్కటి ఒక్కొక్క తరహావి. అయితే ప్రతి ఒక్కటీ ఒక్కొక్క స్పష్టమైన వ్యక్తి. హెగెల్ మాటలలో చెప్పాలంటే "డైజర్" ("ఇతడు" అని చెప్పగలది) నిజానికి ఉండవలసింది అల్లాగే. ఇంక నిష్పక్షపాతంగా చెప్పాలంటే ఏదో ఒక తప్పు వెతకాలి కదా. ఇందుకు ఆర్నాల్డ్ దొరికేడు. అతడు చాలా చాలా యోగ్యుడు. చివరకు గట్టు కూలి అతడు చనిపోయి నప్పుడు, ఈ ప్రపంచంలో అటువంటి వాళ్ళు వుండ లేరులే అనుకొని సంతృప్తిపడవలసి వుంటుంది. అయితే రచయితకి తన పాత్ర పట్ల అంత ఆరాధన ఎప్పుడూ కూడదు. ఇక్కడ నువ్వు ఆ పొరపాటే చేశావని నాకనిపిస్తోంది. ఎల్సాన్ ఆదర్శ మూర్తినే చేసినా ఆ పాత్రలో కొంత వైయక్తికత వున్నదనిపిస్తుంది. కాని ఆర్నాల్డ్‌లో ఆ వ్యక్తిత్వం ఆదర్శంతో వింతగా కలిసిపోయింది.

ఈ లోపానికి మూలం ఎక్కడుందో నవలే చెప్తుంది. నువ్వు నీ పుస్తకంద్వారా ప్రజలముందు నిలవాలనీ, ప్రపంచం ముందు నీ విశ్వాసాలను రుజువు చేసుకోవాలనీ అనుకొన్నట్లు స్పష్టపడుతోంది. ఇప్పుడు నువ్వు చేసిందదే. ఆ దశను నువ్వు దాటిపోయావు. ఈ

రూపంలో మళ్ళీ చెయనక్కర్లేదు. నేను నిబద్ధ కవితను ఎంతమాత్రము వ్యతిరేకించడం లేదు. విషాదాంత నాటకాలకు ఆద్యుడైన ఎకిలస్, సుఖాంత నాటకాలకు ఆద్యుడైన అరిస్టోఫేనస్ ఇద్దరూ కూడా పూర్తిగా నిబద్ధులైన కవులే. డాంటే, సెర్వాంటెస్ తక్కువ వాళ్ళుకాదు. స్కిల్లర్ వ్రాసిన "కబలె ఉన్డ్ లైబే" మొట్టమొదటి జర్మన్ రాజకీయ సమస్యా నాటకం అనడం కన్న పెద్దగా చెప్పనక్కర్లేదు. మంచి మంచి నవలలు వ్రాస్తున్న ఈనాటి రష్యనులూ, నార్వీజియనూ అంతా ఒక లక్ష్యంతో వ్రాస్తున్న వారే. స్పష్టంగా చెప్పడం ద్వారాగాక పరిస్థితులూ, ఘటనలనుంచే లక్ష్యం అవగతం కావాలనుకుంటాను. తాను చిత్రించే సామాజిక సంఘర్షణల భావి చారిత్రక పరిష్కారాలను రచయిత పాఠకుల ముందు వుంచనక్కర్లేదు. మరొకటుంది. మనం నేడున్న పరిస్థితులలో నవలలు చాలా వరకు బూర్జువా తరగతి పాఠకుల కోసం, అంటే మన తరగతికి సరాసరి సంబంధించని పాఠకుల కోసమే వ్రాయబడుతున్నాయి. అంటే సోషలిస్టు సమస్య నవలలో యదార్థ పరి తుల్ని సరిగ్గా చిత్రిస్తే, ఆ పరిసితు గురించి ప్రముఖంగా వుండే మామూ భ్రమల్ని అది తొలగిస్తుందనీ; బూర్జు ప్రపంచపు ఆశాభావాన్ని భగ పరుస్తుందనీ; అక్కడున్న సమస్య సరాసరి పరిష్కారం చూపకపోయినా ఒక సందర్భంతో ప్రత్యక్షంగా త అభిమానం ఎటో చెప్పక పోయినా ఇప్పుడున్నది ఇల్లాగే శాశ్వతంగ వుండడం గురించి తప్పకుండా అన మానాలు సృష్టిస్తుందనీ; తన క వ్యాన్ని ఆ విధంగా పూర్తిగా నెరవేర స్తుందనీ నా భావం. ఆస్ట్రియను రైతు గురించీ, వియన్నా సమాజం గురిం నీకున్న ఖండితమైన పరిజ్ఞానానికి ఎంతో ప్రశంసనీయంగా, సజీవంగ చిత్రించగల శక్తికీ ఇక్కడ బోలెడం అవకాశం లభించింది. చక్క వ్యంగ్యంతో పాత్రలను రూపొ దించడం రచయితకు తన సృష్టిపైగ ప్రభుతను తెలుపుతుంది. నీ సామర్థ్యం వున్నదని "స్టిఫాన్" ల రుజువు చేసుకొన్నావు...

ఎఫ్. ఎంగెల్

## విషాద కేతనం....సవేర

శస్త్ర చికిత్సలో వైద్యుడు
తరిగేసిన కండలా
సిగ్గుసెరాన్ని - ఆకలి
ఉరి కొయ్యకు తగిలించి
మానవత్వపు విలువల్ని
కోరికల నాలుకలు చాచుకున్న
తొడేళ్ళకు విసిరేసి
నగ్నంగ వ్యభిచరించింది
దారిద్ర్యం - ఓ చీకటి రాత్రి.

పగిలిన గుండెలు కక్కే
నవ్వుల నురగల్ని,
తృప్తిగ తేన్చే తోడేళ్ల
'సం' తృప్తిని నింపుకున్న
ఆ చిక్కటి చీకటి రాత్రి -
ధనస్వాములు ఏలే - ఈ
దమనకాండ వ్యవస్థలో
దారిద్ర్యం ఎగరేసిన
విషాద కేతనంలా వుంది.

# కాందిశీకులారా జీరో అవర్ సమీపిస్తోంది!

**శశికాంత్ శాతకర్ణి**

క్రాంతి బూడిదయి పోయిన విదేశీ భూభాగాల నుండి, శాపదగ్ధమైన పట్టణాల ండీ పరారీ అయి వచ్చిన కాందిశీకులకు మీరు స్వాగతగీతాలాలపించారు. మీ ష్టలలో ఒక వివేకమూ ఉంది. ఒక వ్యంగ్యమూ ఉంది. మట్టిగోడల పూరి ండిసెలలో సన్నగా వెలిగే సాహార్ద దీపం ఆ వివేకం! బయటి నుండి వచ్చిన ందిశీకులను స్వాగతించి మీ బ్రతుకు నిగూఢ పరచు కొందామను కోవడం – మ్మ చీకటిలో మెరిసే అసిధార. మరి మీ జీవితాల గురించి ఎప్పుడు ఆలోచించు ంటారు?

దూసుకు పోయే మోటారు ాహనాల్ని మీరె ప్పుడూ దూషించు ంటూనే ఉం టారు. బితుకు బితు ఁగా ... ఎగుడు దిగుడు గతుకు ఁగా.... అడుగులో అడుగు వేసు ంటూ నంగినం గిగా నడుస్తారు. ్వల్పమైన కోరి కల్నే కోరుకుం ారు. అందినఅల్ప పరిధిలోనే ఆనం ంగా ఉంటారు. మీ పిల్లలతో ఆడు ంటారు. అదే జీవితం మకరంద ... మందహాసతుందిలంగా....! అందరూ పీల్చే గాలే మీరూ పీల్చి అందరూ లవాటుగా చేసే పనులే మీరుచేసి, అదే మహత్తర విజయమనుకొని సంతోషి ారు. అదేనా మీ జీవిత చరమ లక్ష్యం, తరగిపోయే జీవనోత్సాహాన్ని ఎక్కడ పాజిట్ చేసారు? తరచు సంభవించే అశోభంగాలకు ఏ మాత్రం ఇన్స్యూర్ నుకున్నారు? మౌనంగా ఓర్చుకోవడం సంక్రమించిన వారసత్వ నిక్షేపమా?

ఇటుక మీద ఇటుక పేర్చి మహా పరిశ్రమించి స్వప్న సౌధాల్ని నిర్మించు ంటారు? అవి ఫళ్ళున కూలిపోతే భయపడి పారిపోతారు. నిస్తబ్దుగా పడివున్న ది ఒడ్డుకు చేరుకుంటారు, విరిగిపడే పర్వత సానువుల్ని చప్పుడు చేయకుండా ది ప్రతిబింబించడాన్ని భీతిభీతిగా క్రీగంట చూస్తారు. విచారిస్తూ కూచుని విషా ల్ని నెమరు వేసుకుంటారు. నింగి ఎత్తుకు ఎదిగిన వ్యధల చెట్ల నుండి రాలిన రాశల ఆకులను పోగుచేసుకుని చలి మంటలు వేసుకుంటారు. మీ ప్రయాణా ప్పుడూ బీటలిచ్చి బీడుపడ్డ బంజరు భూముల్లోంచి ఎండమావులుడిగిన ఎడారి రుల్లోకి !

మూతబడిన ఫ్యాక్టరీల మధ్య, లాకౌట్ చేసిన కార్ఖానాల ముందు ఖాళి యిన ధాన్యం గిడ్డంగుల దగ్గర, కూలిపోయిన ఇళ్ళ చుట్టూ దేనినో పారేసు న్నట్టు వెతుక్కుంటూ తిరుగుతారు. పల్చటి పరదాలా, మందకొడిగా వర్షపు ంపరలా సెల్ఫ్‌పిటీ మీమీద అవిరామంగా కురుస్తూనే ఉంటుంది. మీరు తొందర ందరగా నడిచే ఇరుకిరుకు సందుల్లో అమానుషంగా చెరచబడ్డ ఆశల కన్యలు ధ కిర్సనాయిలు పోసుకుని పబ్లిగ్గా ఒంటికి నిప్పంటించుకుంటారు.

ఏ ద్వీపాంతరవాసం ఇంత దుర్భరంగా వుంటుంది ? శిరస్సుల మీద కష్టాల ముళ్ళ కిరీటాలు ఏ నరకంలో ఇంత వికృతంగా నర్తిస్తాయి? ఘనీభవించిన నిద్దురలా జీవితం ఏ గోళంలో ఇంత దుస్సహంగా సాగుతుంది ?

అయినా మీ హృదయాలు ఇంత నిశ్చలంగా, ఏమీ పట్టనట్టు ఎలా ఉండ కల్గుతున్నాయి ? భవిష్యత్తుపై మీ విశ్వాసం తరగక ఎలా వుంది ? అదేనా మీకున్న ఒకే ఒక్క బలం ? అందుకేనా వినాశనం మిమ్మల్ని తాకలేకపోతోంది

ఈ దుర్వ్యవస్థ పై మీరు చేయనున్న పోరాటానికై అవసరమయిన ధైర్య సాహసాలను ఆవాహన చేస్తూ, నింగి మీద మెరిసే నక్షత్రాలనెప్పుడైనా వీక్షించారా? కచేరీలో గాయకుని గానాన్ని మెల్లగా అనుచరించే వాయులీన నాదమాధుర్యంలా భూ భాగం మీద ప్రసరిస్తున్న సూర్యరశ్మి శ్రావ్యతనెప్పుడైనా విన్నారా? పక్షి మానిలంతో సజీవంగా అంతులేని నిశ్శబ్ద పోరాటం సాగిస్తున్న చిన్న చిన్న ఊర పిచ్చుకల కథలు తెల్సుకుందుకు ఎప్పుడైనా ప్రయత్నించారా ? నదీ తరగలలో తేలియాడే పద్మాల అమాయక సౌందర్యాన్ని ఎప్పుడైనా ఉపాసించారా ?

మీకు తెలియని అనేక రహస్యాలను విప్పుతాను అందరూ రండి ! మీ మత్తును పోగొట్టే కాంతిలా నిశితమైన ఆలోచనల ఇంజక్షన్ చేస్తాను, సంసిద్ధం కండి ! విప్లవ పథకాల మంటల్లోకి దూకేందుకు అవసరమయిన గాఢ దీక్ష టానిక్‌గా ఇస్తాను !

మీ సహనం ఆఖరి బిందువుకు చేరుకుంది. ఈ చిరిగిపోయిన మలిన వస్త్రాన్ని ఎంత కాలం ధరిస్తారు ! ఇంకా ఎంత కాలం ఈ మత్తు ? ఇంకా ఎంత కాలం ఈ శవభారం ? ఇంకా ఎంత కాలం ఈ దుస్సహ దుర్భరస్థితి ? ఇంకా ఎంత కాలం శిరస్సుల మీద ఈ నిర్జీవ సహనాల శీతల పాషాణాలు ? తరతరాలు అను జీవించిన ఆకలీ, నిరంతర అవమానాలు ఇంకొద్దు. క్రోధాల బండ రాళ్ళన భద్దలు కొట్టి చూడండి ! అది ఈ దుర్వ్యవస్థను కడిగి వేస్తుంది. మరి లేవండి ఐరో అవర్ సమీపిస్తోంది !

# ముందుగా నేనే . . . . బొల్లిముంత నాగేశ్వరరావు

మరలా తెల్లవారింది !
ఎర్రగా – చల్లగా –
బద్ధకం వళ్ళు విరుచుకుంది !
నిన్నటిలాగా ఈ రోజు కూడా
వృధా కాగూడదనీ –
చీకటి అన్యాయాల పైద
ఈ రోజు ఉదయించిన సూర్యుడు
మరింత ఎర్రగా ఉండాలనీ
ఆశగా అరుణోదయం
వైపుకి చూశాను !

క్షణక్షణానికి వేడెక్కుతుంది గానీ
ఎరుపుదనం మాయమవుతుంది !
ఎక్కడుంది 'ఎరుపు' అనుకుంటూ
వెదకి వెదకి చూస్తే –
ఎదురుగా ఉన్న మిత్రుడు చెప్పాడు
నీ కళ్ళలో ఎరుపుందని !
అప్పుడనుకున్నాను నేను !
'జ్వలిస్తున్న తిన్నని సూర్యకిరణాలకు
చలి చాల్సింది ముందుగా నేనే అని.!'

# ప్రాణం ఖరీదు కారు చౌక

సొదుం రామ్మోహన్

ప్రాణం ఖరీదు' సినిమా చూసి ప్రాణం కేలిక పడింది. అందులోని వర్గఘర్షణ ?రించి, సామాజిక చైతన్యం గురించి ?న్ని పత్రికలు బాగనే రాసాయి. ?యితే ఆ సినిమాలో వున్న ఒకటి, ?ండు ముఖ్యమైన అంశాల గురించి ?న పత్రిక లేవీ రాసినట్లు ?దు.

ఆ అంశాల గురించి ?యడానికి ముందు ఆ ?నిమా కథ గురించి ?ాకీగా రెండు ముక్కలు ?ాస్తా.

ఒక పల్లెటూర్లో ?నకయ్య అనే మోతుబరి రైతు వుం?ాడు. అతను మహా చండ శాసనుడు, ?ర్కోటకుడు. ఒక్క మాటలో చెప్పా?ంటే కరుడు గట్టిన ఫ్యూడల్ సంస్కా?ం అతనిది. వయస్సు మళ్ళినా హోదా ?ోసం చదువుకున్న పట్నం పిల్లను ?ండో పెళ్ళి చేసుకున్నాడు. పెళ్ళి ?ేసుకున్నాడే కానీ దాంపత్య ధర్మం ?ర్వర్తించే ఓపిక అతని దగ్గర లేదు. ?ర్సిగాడు, దేవుడు అతని పాలేళ్ళు. ?ేవుడు మూగివాడు, మెతక. నర్సి?ాడు తిరుగుబాటు స్వభావం కలవాడు. ?ేవుడు చెల్లెలు బంగారిని నర్సిగాడు ?ేమిస్తాడు. పెళ్ళి చేసుకోడానికి నర్సి?ాడు, బంగారి ఇద్దరూ నిర్ణయించారు.

భార్య బంగారం లాటిదైనా ?నకయ్య ఆమెను అనుమానిస్తాడు. ?ేవుడిపై ఆమె జాలి చూపుతుండడంతో ? అనుమానం అతనిపై మళ్లుతుంది. ?స భార్య మంచిగంధం లాటి మన?సను అర్థం చేసుకునే సంస్కారం ?తనికి లేదు.

ఒక రోజు కనకయ్య బావమరది బంగారిని చెరుస్తాడు. రివాజు ప్రకారం అతనికి పాతిక రూపాయలు జరిమానా విధిస్తారు. అకృత్యం చేసిన అతని బావమరదికి తన చెల్లెల్ని యిచ్చి పెళ్ళి చేయమని దేవుడు (మూగవాడు) కనకయ్యను బతిమాలుతాడు. కనకయ్య వుగ్రుడై చావ బాదుతుంటాడు. భార్య చూడలేక అడ్డు పడితే అనుమానం యింకా ఎక్కువై ఇద్దర్నీ దారుణంగా చంపుతాడు. పేదవాడిపై అనుమానం ఖరీదు వాడి ప్రాణం. అంటే పేదవాడి ప్రాణం ఖరీదు కారుచౌక అన్నమాట. ఆ పేదవాడి చెల్లెలు మానం ఖరీదు పాతిక రూపాయలు. రెండు ప్రాణాలు నిట్టనిలువునా తీసిన కనకయ్యపై దేవుడి (మూగివాడు) వర్గంవాళ్ళు కసి తీర్చుకుంటారు. నోరూ వాయిలేని ఆ మూగజీవులు తిరగబడి కనకయ్యను చంపుతారు. కథ ముగుస్తుంది.

ఇక మొదట అనుకున్న ఒకటి రెండు పాయింట్లు గురించి చెప్పుకుందాం.

ఇందులో మధ్యతరగతి వివాహ వ్యవస్థపైనా, నైతిక సూత్రాలపైనా చావు దెబ్బ తీసారు. వివాహం, నైతిక సూత్రాలకు సంబంధించి వ్యవసాయ కార్మికుల మధ్య, మధ్య తరగతి అస్తి జీవుల మధ్య వున్న వ్యత్యాసాన్ని చక్కగా ఎండగట్టారు.

వ్యవసాయ కార్మికుల పెళ్లిళ్ళకు మూలం ఇష్టం. మధ్య తరగతి భాషలో చెప్తే ప్రేమ. మధ్య తరగతి జీవుల పెళ్ళిళ్ళకు మూలం ఆర్థిక బంధనాలు

సరళభాషలో చెప్తే డబ్బు. కనకయ్య రెండవ పెళ్ళి చేసుకుంది కేవలం హోదా కోసం. అతనికి ఆ పిల్ల నిచ్చింది కూడా అతని ఆస్తి చూసే. ఆ విషయం కనకయ్యే ఓమాటు భార్యతో అంటాడు. డబ్బులేక నీ పెళ్ళి ఆగిపోతే నేను నిన్ను చేసుకున్నాను అంటాడు. ఆ అనడం మామూలుగా కాదు. అందుకు నువ్వు నాపట్ల కృతజ్ఞతా పూర్వకంగా వుండా లన్న భావం అందులో వుంది. కనకయ్య పెళ్ళికి కాంట్రాస్టుగా నర్సిగాడి ప్రేమ చూపారు. నర్సిగాడు, బంగారి ప్రేమించి పెళ్లి చేసుకోడానికి సిద్ధంగా వుంటారు. జరగబోయే ఈ పెళ్లిలో ఆర్థిక బంధ నాలు, కృతజ్ఞతలు గట్రా లేవు. ఇది కేవలం హార్దికమైన అనురాగ సంబంధి. అది సాధారణంగా ఆస్తిగల వర్గాలకు అతీతంగానే వుంటుంది. వాళ్ల పెళ్లిలో తరుచుగా డబ్బే కీలకపాత్ర వహిస్తూ వుంటుంది.

బంగారి మీద కనకయ్య బావమరిది చెయ్యి వేసినపుడు, అతని చెల్లి (కన కయ్య భార్య) అతన్ని మందలిస్తుంది. వాళ్లు ప్రేమించుకున్నారు; రేపో మాపో పెళ్లి చేసుకుంటారు. ఆ అమ్మాయి మీద కన్ను వేయొద్దు. వాళ్ల పెళ్లిళ్లు మన పెళ్లిళ్ల లాటివి కాదు, అవి కేవలం ఇష్టంతో కూడుకున్నవి. మనవి అలా కాదు. మనవి డబ్బు పెళ్లిళ్లు, మనసు పెళ్లిళ్లు కాదు అంటుంది ఆమె స్పష్టంగా.

ఇందులో ఆసక్తికరమైన ఒక ఘటన వుంది. వ్యవసాయ కార్మికుల్లో ఒక స్త్రీ తనకు విడాకు లిప్పించమని పేటలోని పెద్దమనుషుల్ని అడుగుతుంది. కొంత డబ్బు చెల్లించి బంగారంలా విడాకులు పుచ్చుకొమ్మంటారు వాళ్లు. అంటే ఆ వర్గంలో ఇష్టంలేని పెళ్ళాంతో కానీ, మొగుడితో కానీ చచ్చినన్నాళ్లూ సంసా రం చేయాల్సిన అవసర మేమీలేదు. మధ్య తరగతి జీవులకున్న కుటుంబ గౌరవం, ప్రతిష్ఠ, హోదా వగైరా దగుల్బాజీ అడ్డుగోడలు వారికి లేవు. వారి స్వేచ్ఛకు, సుఖానికి ఇవి అడ్డే రావు. ఇవి అడ్డువచ్చేదల్లా మధ్య తరగతి జీవులకే.

నిజానికి మోతుబరి కనకయ్య భార్యను ఈ సమస్యే మానసికంగా వేధిస్తుంది. ఈ మానసిక ఆవేదనని చాలా సున్నితంగా చిత్రించారు. తను అక్కడ వుండి సుఖపడడం లేదు. ఆమె పెళ్లయ్యాక మగనివద్ద క్షణం కూడా దాంపత్యసుఖంఅనుభవించి యెరుగదు. అయినా ఆమె అతని నుంచి విడాకులు అడిగే సాహసం చేయలేదు. ఇప్పుడు సుఖం లేదు, ఇక ముందు లభిస్తుందన్న హామీ లేదు. అయినా ఆమె ఆ ముళ్లస్వర్గా నికి బందీ. అక్కడ నుంచి వెళ్లిపోయి మళ్లీ పెళ్లి చేసుకుందామన్న ఆలోచన రాదు. వచ్చినా మరుక్షణమే మధ్యతరగతి కుహనా గౌరవం, ప్రతిష్ఠ, హోదాలు దాడిచేసి ఆమెను ఓడించి తీరుతాయి.

పోతే ఇందులో దాంపత్య జీవితానికి సంబంధించి మరో మంచి పాయింటు వుందనిపించింది. అదెంతవరకు రైటో విజ్ఞులే నిర్ణయించాలి.

నిజానికి కనకయ్య మరీ వయసు మళ్లిన వాడేం కాదు. అయినా అతనికి ఒకరోజు కాకపోతే ఒకరోజు కూడా పెళ్ళాం మీద లైంగిక వాంఛ కలగదు. అందుకు ప్రధాన కారణం అతని మాన సిక ప్రవృత్తే అనిపిస్తుంది. అతని మాన సిక ప్రవృత్తిని రూపొందించడంలో అతని భౌతిక పరిస్థితుల పాత్ర కీలక మైంది. అంటే అతడు ఫ్యూడల్ పరి

సరాలలో పెరిగినవాడు. అతనిది పచ్చి ప్యూడల్ సంస్కారం. పందెపు కోడి మీద చూపినంత ప్రేమ కూడా అతను పెళ్ళాం మీద చూపడు. అతని దృష్టిలో పెళ్ళాం కేవలం ఒక పరికరం, వంట మనిషి, తన హోదాకు చిహ్నం. తన కున్న బండెడు నగలు దిగేసుకోడానికి పుట్టిన మట్టి బొమ్మ. అతనిది ఈ సంస్కారం అయినందువల్లే అతనిలో తొందరగా లైంగిక వైక్లబ్యం (sexual impotency) ఏర్పడి వుంటుందని నా అనుమానం. ఎందుకంటే ప్రేమ, స్నేహం, సెక్సు లాంటివి నిరంతరం కల్టివేట్ చేసుకోవలసినవి. వాటిమీద ముందు మానసిక వైక్లబ్యం కలిగితే ఆ తర్వాత శారీరక వైక్లబ్యం కలుగుతుంది. ముఖ్యంగా సెక్స్‌కు ఈ మాట వర్తిస్తుంది. డబ్బు సంపాదన మీదో, వృత్తిమీదో విపరీతమైన ఏకాగ్రత నిలిపితే ఆ కాలంలో లైంగిక వాంఛలు పుడిగిపోయే అవకాశం వుందంటారు మానసిక శాస్త్రవేత్తలు.

కనకయ్యకు కాంట్రాస్టుగా పెద్దోడి పాత్రను తీసుకోవచ్చు. వయసులో ఇతను కనకయ్య కంటె పెద్దవాడైనా పెళ్ళిపట్ల, ప్రేమపట్ల అతనిలో కనకయ్యలాగా మానసిక వైక్లబ్యం పుట్టలేదు. కనపడిన పిల్లనల్లా నన్ను పెళ్ళి చేసుకుంటావా? అని అడుగుతుంటాడు సరదాగా. అంత ముసల వాడైనా అతనిలో వైవాహిక జీవసంపట్ల హృదయపూర్వకమైన అభిలాష వుంది. మరొక జీవిని ఆత్మిక జీవనంలో భాగస్వామిగా తెచ్చుకోవాలన్న ఆర్తి వుంది అతనిలో. ఇది కనకయ్యలో పూర్తిగా లోపించింది. ఈ అంశాలపై విజ్ఞులు ఇంకొంచెం పరిశీలిస్తే బాగుంటుంది.

## చితుకు బ్రతుకు

గోపాప్పోళ్ళు —
చలి కాచు కుంటున్నారు
చితుకుల్ని రాజేసుకుని!
బీదోళ్ళ బ్రతుకులే
గొప్పోళ్ళకి చితుకులని
పాపం – ఆ మనసులకు
తెలిసే దెపుడో . . .!

## వైరం

కప్పల్ని పాములు
పాముల్ని నెమళ్ళూ . . .
ఎలుకల్ని పిల్లులు
పిల్లుల్ని కుక్కలు . . .
ముంగిస పాముకీ
ఎలుక పిల్లికి
పరస్పరం జాతివైరం!
మనిషి - మనిషికి
అంటరాని వైరం!
కలిమి – లేములకి
కలకాలం వైరం!!

యన్నంరెడ్డి వెంకటరెడ్డి

## బెగ్గర్స్

నేనిలా
లేని నాలుగ్గోడల మధ్య
పగిలిన
కుండల్లో
కాలని కట్టెల్తో
వొండుకుని
పొగ నంజుకుని
తింటుంటే –
ఓటని బిచ్చం
అడిగేందుకు సిగ్గు లేదురా

జయధీర్ తిరుమలరావ్

# నైజీరియా నవలా సంగ్రహం

చినువా అచెబే నైజీరియా దేశీయుడు. పాశ్చాత్య సంపర్కంలో నైజీరియన్ తెగల జీవిత విధానం ఏ విధంగా శిధిలమై, మారిపోయిందో వర్ణిస్తూ ఆయన వ్రాసిన నవల Things fall apart చాల ప్రఖ్యాతి పొందింది. ఇంగ్లీషు చదవగల ఆఫ్రికా ఖండ దేశాలన్నింటా అది విశేష ప్రజాదరం పొందింది. 1958లో మొదటి మారు ప్రచురితమైన ఈ నవల, పదిపన్నెండేళ్లలో గొప్పగ్రంథంగా పరిగణన పొంది, ఎందరో రచయితల్ని ప్రభావితుల్ని చేసింది.

నైజీరియా తూర్పుభాగంలో ఇబో తెగలు జీవించే గ్రామలలో 1890 – 1900 సంవత్సరాల మధ్య జరిగిన కథగా ఈ నవల చిత్రించబడింది. ఆ తెగలు నివసించే తొమ్మిది గ్రామాలకు కేంద్రం ఉమోఫియా ఈ కథకు రంగం.

## విచ్ఛిత్తి

### చినువా అచెబే

"ఆ తొమ్మిది గ్రామాల్లోనే కాదు, ఇంకా దూరగ్రామాల్లో కూడ ఒకోన్క్వో పేరు చాల ప్రసిద్ధి పొందింది. ఆ కీర్తి నతడు స్వశక్తితో సాధించుకొన్నాడు. పద్దెనిమిదేళ్ల వయస్సు నాడే కుస్తీలో అమలిజేను ఓడించి తెచ్చుకొన్న పేరది. అమలిజే గొప్ప వస్తాదు. ఉమోఫియా – ఎంబైనోల మధ్య ప్రదేశంలో ఏడేళ్ల మధ్యలో అతనిని ఓడించిన వారే లేరు. అతని నెవ్వరూ చిత్తు చేయలేక పోయారు. ఆ కారణంగానే అతనిని పిల్లిగాడంటారు జనం. అటువంటి వానిని ఒకోన్క్వో చిత్తు చేసేసేడు. ఆ గ్రామ ప్రతిష్ఠాపకుడు ఆ అడవిలోని భూతంతో ఏడు రాత్రులూ, పగళ్ళూ జరిపిన ఘోరమయిన కుస్తీ తరవాత ఇదే చెప్పతగిందని, ఆ గ్రామ పెద్దలంతా వొప్పుకొన్నారు."

– అంటూ ఒకోన్క్వో చిత్రణతో ఈ నవల ప్రారంభం అవుతుంది.

"ఒకోన్క్వో చిన్న వయస్సువాడే అయినా, తన వయస్సు వారిలోకెల్లా చాల పేరు ప్రతిష్ఠలు గల వారిలో ఒకడయ్యేడు. అతని తెగప్రజలలో వయస్సుకి గౌరవం వుంది. సాధనపట్ల పూజ్యభావం వుంది. పెద్దవాళ్లు చెప్పినట్లు చేతులు శుభ్రంగా కడుక్కుంటే, రాజుతో కలిసి భోజనానికి కూర్చోవచ్చు."

ఒకోన్క్వో తన చేతులు శుభ్రంగానే కడుక్కున్నాడు. కనక తొమ్మిది మంది గ్రామ పెద్దల సరసన కూర్చో గలుగుతున్నాడు. యుద్ధం, రక్తపాతం లేకుండా సామనస్యంగా వ్యవహారం పరిష్కారం చేసుకు రావడానికి ఉమోఫియా అతనిని ఎంబైనో గ్రామానికి దౌత్యం పంపిందంటే, అతనికి గ్రామంలో గల గౌరవాన్ని అర్థం చేసుకోవచ్చు.

ఎంబైనో గ్రామంలో జరుగుతున్న సంతలో ఆ గ్రామస్థుడొకడు ఉమోఫియా గ్రామానికి సంబంధించిన ఒక పడుచును చంపేసేడు. ఆ వ్యవహారం తేల్చుకోడానికి ఉమోఫియా వారు ఒకోన్క్వోను దౌత్యం పంపేరు. ఉమోఫియా పెద్ద వూరు. బలమైన గ్రామం. దానితో పేచీపడి యుద్ధానికీ, రక్తపాతానికీ ఎంబైనో గ్రామం సిద్ధంగా లేదు. హత్యచేసిన పడుచుకు ప్రతిగా తమ గ్రామానికి చెందిన ఒక యువతినీ, ఒక బాలుడినీ ఇచ్చేశారు.

ఆ కుర్రవాడు ఒకోన్క్వో వద్దనే

మూడేళ్లపాటు పెరిగేడు. వాడు ఒకోన్‌క్వోను నాన్నా అని పిలవడం ప్రారంభించేడు. వాని మీద ఒకోన్‌క్వోకు అనురాగం బలపడింది.

హఠాత్తుగా శకున దేవత గ్రామ క్షేమంకోసం ఇకమేఫునాను బలి ఇవ్వాలని చెప్తుంది. ఒకోన్‌క్వో వద్ద పెరుగుతున్న ఎంతైనా గ్రామ బాలుని పేరు ఇకమేఫునా.

నిర్దయ, నిర్మమత్వం, ధైర్య, సాహసాలు మగతనపు లక్షణమనీ, మెత్తదనం, దయ, సౌకుమార్యం వంటివి ఆడ లక్షణాలనీ తెగ ప్రజల భావం. తన మగతనపు ధీరత్వాన్ని కనబరచడం కోసమే, ఇకమేఫునాను చంపడానికి వానిని అడవిలోకి తీసుకెళ్లిన వారితో ఒకోన్‌క్వో కూడా వెళ్ళేడు. 'నాన్నా నన్ను చంపేస్తున్నార' ని ఆ బాలుడు అరిచినప్పుడు, వానిని నరికి చంపేసిన వాడు ఒకోన్‌క్వోయే. ఎంత ధీరత్వం చూపదలచినా, ఆ హత్య అతని మనస్సుని కలత పెట్టనే పెట్టింది.

"ముసలమ్మలా ఈ వొణికి పోవడం ఎప్పటి నుంచి? పరాక్రమానికి తొమ్మిది గ్రామాలలో ప్రఖ్యాతి పొందిన నువ్వేనా? యుద్ధంలో అయిదుగురుని హతమార్చిన మనిషి కుర్రాడిని చంపినందుకు కుంగిపోడమేనా? ఒకోన్‌క్వో! ఆడారివాడివై పోయావురా" అని అత్మ అభిశంసనకు పూనుకొన్నాడు.

ఆ పని చేసినందుకు అతని మిత్రుడు ఒబీరికా ఒకోన్‌క్వోను నిరసించేడు.

"నువ్వు చేసిన పనిని భూదేవి సహించదు. దేవి మొత్తం కుటుంబాలనే నిర్మూలించే పాడు పని చేసేవు" అని నిందించేడు.

భూదేవి హత్యలను సహించదు. భార్యల్ని కొట్టడం సహించదు. కవల పిల్లల్ని కనడాన్ని ఒప్పుకోదు. కారణాలు భిన్నమైనా, గ్రామసమైక్యతకు పెట్టుకొన్న నియమాలవి. ఒబీరికా భార్య కవలల్ని ప్రసవించినప్పుడు వాటిని అతడు ఎంతో బాధ పడుతూనే అడవిలో పారేసి వచ్చేడు.

ఓమారు ఒకోన్‌క్వో వేళకి వంట చెయ్యలేదని మూడో భార్యని తరిమి తరిమి కొట్టేడు. వెంటనే భూదేవత పూజారి ఎజియానీ కలగ చేసుకొన్నాడు.

"నువ్వు చేసిన పాడు పని వూరునీ, వాడనీ నాశనం చేస్తుంది. భూదేవిని నువ్వు అవమానం చేసేవు. ఆమె అదనపు పంట నివ్వ నిరాకరిస్తుంది. మనమందరం చచ్చిపోతాం" అని గోల పెట్టాడు.

మగసిరీ, తెగకట్టుబాట్లు గురించి అత్యభిమానం చూపే ఒకోన్‌క్వో, ఒక ఆడారి నేరంచేసి గ్రామంవదలి పారిపోవలసి రావడం జీవితం సృష్టించే సంక్షోభాలలో ఒకటి.

ఎజుడూ అనే గ్రామవృద్ధుడు మరణించేడు. ఆయన చరమ యాత్రలో గ్రామమంతా కోలాహలంగా పాల్గొంది. కేకలు, గంతులు, చిత్రవేషాలు, కర్రసాములు, గౌరవ సూచకంగా తుపాకి కాల్పులు, డప్పుల మోతలు — ఒకటే గంద్రగోళం. ఆ హడావిడిలో ఒకోన్‌క్వో కాల్చిన తుపాకీ పేలిపోయి పక్కనున్న గ్రామస్థుడొకడు చచ్చిపోయేడు. పొరపాటున జరిగినా అది హత్యే. ఆ హత్యకు కారకుడైన ఒకోన్‌క్వో శిక్షార్హుడు.

తెగ ఆచారాల ప్రకారం హత్యానేరాలు రెండురకాలు. మగ నేరాలు, ఆడారి నేరాలు. పొరపాటున జరిగిన

నేరాలు ఆడారి నేరాలు. తెగకు చెందిన వానిని చంపడం భూదేవికి అపచారం. అందుచేత ఒకోన్క్వో శిక్షార్హుడు. కాని అతను చేసింది ఆడారి నేరం. కనక గ్రామంనుంచి పారిపోయి, ఏడేళ్లు ప్రవాస శిక్ష ననుభవించాలి. అంత కాలం గ్రామంలో అడుగు పెట్టరాదు.

ఆ రాత్రి అతడు విలువైన వస్తువు లన్నీ నెత్తి మూటలు కట్టుకున్నాడు. ఆడాళ్ళూ, పిల్లలూ గోలు గోలున ఏడుస్తున్నారు. ఒబీరికా వంటి అయిదారుగురు సన్నిహిత మిత్రులు అతని నూరడించి, సాయం చేయడానికి వచ్చేరు. అతని ధాన్యాన్ని ఒబీరికా గాదెల్లోకి చేర్చడానికై వారంతా తొమ్మిది పది తడవలు తిరిగేరు. కోడి కూత వేళకి ఒకోన్క్వో కుటుంబంతో సహా పారిపోయేడు. ఎంబైనో పక్కనున్న ఇంబాటాలో ఇక ముందు ఒకోన్క్వో కాపురం వుంటాడు.

''తెల్లవారేసరికి ఎజూడూ ఇంటివేపు నుంచి యుద్ధపు దుస్తుల్లో పెద్ద గుంపుగా గ్రామ ప్రజలు ఒకోన్క్వో యింటిమీద పడ్డారు. ఇళ్లకు నిప్పు పెట్టేరు. గోడలు కూలగొట్టేరు. పశువుల్ని చంపేసేరు. కొట్లాలు ధ్వంసం చేసేరు. ఇదంతా భూదేవి శిక్షాస్మృతి. వారంతా ఆమె ప్రతినిధులు, వారికి ఒకోన్క్వో మీద ద్వేషం లేదు. దాడిచేసిన వాళ్లలో అతని మిత్రుడు ఒబీరికా కూడా వున్నాడు. తమ తెగవాని రక్తంతో, ఒకోన్క్వో కలుషితపరచిన భూదేవిని వారు శుద్ధం చేసేరు.''

ఒకోన్క్వోను ఏడేళ్ల పాటు ప్రవాసం పంపేసి గ్రామం ఆత్మశుద్ధికి ఉపక్రమించింది. అయితే ఈ చర్య ఎంతవరకు సముచిత మనే ఆలోచన గ్రామీణులలో తల ఎత్తక పోలేదు.

దైవేచ్ఛ నెరవేర్చేక ఒబీరికా తన ''ఒబి'' (కుటీరం) లో కూర్చుని, మిత్రుని ఆపదకు దురపిల్లేడు. ఏదో పొరపాటున జరిగిన పనికి మనిషి అంత బాధ పడవలసిందేనా? అతనికి సమాధానం దొరకలేదు. తన భార్యకు కలిగిన కవలలు గుర్తొచ్చేరు. వారిని తానే అడవిలో పారేసేడు. వాళ్లు చేసిన నేరం ఏమిటి? వారి పుట్టుక భూదేవికి అపచారమనీ, వారిని ధ్వంసం చెయ్యాలనీ భూదేవి ఆదేశం. ఆ మహాదేవికి జరిగిన అపచారాన్ని సరిదిద్దక పోతే, ఆ నేరం చేసిన వారి మీదనే గాక, గ్రామం మొత్తం మీద దేవికి ఆగ్రహం కలుగుతుంది. ''ఒక వేలుకి నూనె రాస్తే, జిడ్డు వేళ్లన్నింటికీ పట్టుకొంటుంది.

గ్రామాన్ని పట్టి వుంచిన సంప్రదాయాల విలువలను ప్రశ్నించడం ఆరంభమయింది.

ఒబీరికా ఆలోచనలలో మార్పుకు మూలకందం, అప్పటికే ఆఫ్రికా గ్రామాలలో అడుగు పెట్టిన క్రైస్తవ మిషనరీల ప్రబోధాల సుదూర ప్రభావం.

ఈ మారు ప్రవాసంలో వున్న ఒకోన్క్వోను చూడ వచ్చినప్పుడు, ఒబీరికా తమ పక్క వూరు అబామేకి తెల్లవాళ్లు వచ్చి ఆ గ్రామాన్ని ధ్వంసం చేసిన వైనం చెప్పేడు.

''గడిచిన నాట్ల కాలంలో అబామేకి ఒక తెల్లవాడు ఇనప గుర్రం మీద వచ్చేడు. అతన్ని చూడగానే జనం మొదట పారిపోయారు. అతడక్కడే నిలబడి, వారిని పిలిచేడు. చివరికి సాహసంచేసి కొందరు దగ్గరికెళ్లేరు. అతన్ని

ముట్టుకున్నారు కూడా. గ్రామ పెద్దలు శకునం సోది అడిగేరు. ఈ కొత్త వాడు తమ గ్రామైక్యతను, గ్రామాన్నీ ధ్వంసం చేస్తాడని సోదె చెప్పింది. దానితో వాళ్లా తెల్లవానిని చంపేసేరు. ఆ మనిషి మిత్రుల్ని పిలుచుకు వస్తుం దేమో నన్న భయంతో వారా యినప గుర్రాన్ని పూజా వృక్షానికి కట్టేశారు. ఇంకా కొందరు తెల్లవాళ్లు వస్తున్నారని శకునం చెప్పింది. వాళ్లని మిడతల దండు అంది. ఈ వూరి సంగతి సం దర్భాలు తెలుసుకోడానికే వాడిని ముందు పంపేరంది. అందుకే వాడిని చంపేసేరు.

కొన్ని నెలలు పోయాక, ఆబామేలో సంత జరుగుతున్న రోజున తెల్లవాళ్ల జట్టు వచ్చి కనిపించిన వాడినల్లా కాల్చే సింది.

మరో రెండేళ్లకి మిషనరీలు ఉమో ఫియా వచ్చేరు. మరో కొద్ది నెలలకి ఇంబాటా వచ్చేరు. అక్కడ మొట్ట మొదట క్రైస్తవ మతం తీసుకొన్న వారిలో ఒకడు, ఒకోన్క్వో పెద్ద కొడుకు సువోయే.

‘‘మూర్తిత్రయ వాదం పిచ్చి తర్కానికి మోహితుడై అతడు మతం తీసుకోలేదు. అతని కది అర్థం కాదు. ఆ నూతన మతపు కవిత్వం అతనిని మూలుగుల్లోంచీ కదిలించింది. భయంతో, అంధకారంలో ఒదిగి కూర్చున్న సోదరుల స్తుతి గీతం, తన తరుణాత్మను నిరంతరం వేధిస్తున్న అవ్యక్త వేదనకు— పొదలలో గుక్క పట్టి ఏడ్చిన కవలల జన్మ సమస్యకు, ఇకమేఫునా హత్య సమస్యకు – సమా ధానం ఇస్తున్నట్లు కనబడింది. ఎండి బీటలు వారిన తన ఆత్మమీద స్తుతి గీతం చల్లని నదిలా ప్రవహించి, ఓదార్పు లభించినట్లనిపించింది. బొగులు మంటున్న నేల తల్లి ఆరిపోయిన అంగుట్లో ఆ స్తుతి గీతాలు వడగళ్లు కరుగుతున్నట్లనిపించేయి. సువోయే అపరిపక్వ మనస్సు సంతృప్తి పడింది.’’

తన కొడుకు మతాంతరుడు కావ డంతో ఒకోన్క్వో ఉగ్రుడయ్యేడు. పోట కత్తితో చర్చికి వెళ్లి నిలుచున్న పాటున అందర్నీ నరికెయ్యాలను కున్నాడు. కాని, ఇంబాటా జనం ఒప్పు కోలేపు. ఇదో శుద్ధ ఆడంగి వూరులే అనుకొని, ఒకోన్క్వో మనసు నిగ్ర హించుకొన్నాడు. తెల్లవాడు మతాన్నే కాదు, పరిపాలననూ తెచ్చేడని అతనికి అర్థం అయింది.

ప్రవాస కాలం ఏడేళ్లూ ముగిసి, ఒకోన్క్వో ఉమోఫియా తిరిగి వచ్చేడు. అతని పునరాగమనానికి గ్రామం వేడుకలు చేసుకోలేదు. కూటంలో న్యాయం ప్రసాదించే తొమ్మండు గురిలో ఒకడు కావలసిన వాడు అతను. ఇప్పుడా పలుకుబడి తనకు లేదని ఒకోన్క్వో గ్రహించేడు.

గ్రామ జీవితంలో ఏడేళ్లు చాల దీర్ఘ కాలం. అక్కడ మనిషి స్థానం అతని కోసం కూర్చోదు. అతను వెళ్లగానే కొత్త వాడొస్తాడు. కూటం బల్లిలాంటిది. తోక పోతే కొత్త తోక మొలుస్తుంది.

అదే జరిగింది. జరిగింది అంతే కూడా కాదు. చర్చి రాకతో గ్రామంలో పార్టీలు వచ్చేయి. చర్చితో పేచీ అంటే, గ్రామం వాళ్లతోనే పేచీ సుమా అని ఒబీరికా హెచ్చరించేడు. తెల్లవాని ప్రభుత్వం భూమి సంబంధాల తగాదాలలోకి దిగి అవినీతిని పెంచింది. ఒకోన్క్వో ఆశ్చర్య పడ్డాడు. ‘‘తెల్లవాడికి మన భూమి

హక్కులు తెలియవా ?'' అంటాడు.

''మన భాషే తెలియని వాడికి మన భూమి హక్కు, ఆచారాలు ఎల్లా తెలుస్తాయి?'' అన్నాడు, ఒబీరికా. ''వాళ్లు మన ఆచారాలు తప్పంటారు. ఆ మతం తీసుకున్న మనవాళ్లూ ఆ మాటే అంటారు. మన సోదరులే మనల్ని కాదంటూంటే నువ్వేం చేస్తావు. తెల్ల వాడు చాల తెలివి గలవాడు. మతం పేరుతో నెమ్మదిగా చాప కింద నీరులా వచ్చేడు. ఏదో మూర్ఖత్వంలే అని నవ్వుకున్నాం. వుండనిచ్చాం. వచ్చిన వాడు మన సోదరుల్నే తన పక్కకి తిప్పుకున్నాడు. ఇంక మనం ఇప్పుడు ఒక్క తాటి మీద పని చెయ్యలేము. మనని పట్టి వుంచిన బంధాల్ని వాడు కోసేసేడు. మనం చెదిరిపోయాం'' అన్నాడు ఒబీరికా. అది వెనుకటి గ్రామం కాదు.

ఒక రోజున కొత్త మత పిచ్చిగాడు ఎనోక్ గ్రామ దేవత గుడిని (ఎగ్వ్యగ్వ్యా) అపవిత్రం చేసేడు. ఆ అకార్యంతో తెగ జీవమే పోయినట్లు ఒకోన్‌క్వో చాలా బాధపడ్డాడు. ఆ కోపంలో వెళ్లి చర్చిని తగలపెట్టేడు. ఇంక ఘటనలు ఒక దాని వెనుక నొకటి తరుముకుంటూ వచ్చేయి.

చర్చిని తగల పెట్టిన ఒకోన్‌క్వోనూ మరి అయిదుగుర్ని జిల్లా కమీషనరు అరెస్టు చేయించి, జైల్లో పెట్టి, అవమానించేడు. చర్చి పునర్నిర్మాణానికై గ్రామం మీద 200 బస్తాల కౌరీలు (నాణెంగా వాడుకొనే గవ్వలు) అపరాధం విధించి, దానిని చెల్లించేకనే అరెస్టయిన ఆరుగురినీ విడుదల చేసేడు.

ఒకోన్‌క్వో విడుదల కాగానే గ్రామం అంతనూ సమావేశ పరిచాడు. తెల్లవాని మీద యుద్ధం ప్రకటించడమా మానడమా అనేది చర్చించడానికి ఆ సమావేశం.

చర్చలు ప్రారంభం కాకముందే సమావేశాన్ని నిషేధిస్తూ, జిల్లా కమీషనరు ఆదేశాలు జారీచేసి, ఇద్దరు వార్తా హరుల్ని పంపేడు. ఆ ఆదేశం వినగానే ఒకోన్‌క్వో కోపం పట్టలేక వార్తాహరుల్లో ఒకడిని నరికేసేడు. రెండో వాడు పారిపోయేడు.

''ఏం పని చేశాడ'' ని సభ్యులు ఆ చర్యను నిరసించేరు.

జనం అంతా లేచి పోయేరు. ఉమోఫియా తెల్లవానితో యుద్ధం చేయదని ఒకోన్‌క్వో గ్రహించేడు. కత్తినున్న రక్తం ఇసకతో తుడిచేసి, తిన్నగా ఇంటి కెళ్లి పోయేడు.

జిల్లా కమీషనరు సాయుధ బలంతో ఒకోన్‌క్వో యింటికి వచ్చేడు. గుమ్మంలో తలలు వేలేసుకుని జనం కూర్చున్నారు.

''ఒకోన్‌క్వో ఎవరు ?'' అంటూ జిల్లా కమీషనరు గద్దించేడు.

''ఇక్కడ లేడు'' అన్నాడు, ఒబీరికా.

''ఎక్కడున్నాడు.''

''ఇక్కడ లేడు.''

జిల్లా కమీషనరుకు కోపం వచ్చి ఒకోన్‌క్వోను పప్పచెప్పకపోతే అందర్నీ జైలులో పెడతానని బెదిరించేడు.

''అతడున్న చోటికి తీసుకెళతాం. మీ మనుషులు కాస్త సాయం చేయగలుగుతారు'' అంటూ ఒబీరికా లేచేడు.

సాయం ఏమిటో అర్థం కాక పోయినా, జిల్లా కమీషనరు తన మనుష్యులతో అతని వెంట నడిచేడు. ఇంటి వెనక భాగంలో ఉరేసుకు చచ్చిపోయిన ఒకోన్‌క్వో శవం వేలాడుతూంది.

"ఇతడు ఉమోఫియాలోని మహా వ్యక్తుల్లో ఒకడు. అల్లాంటి వాడు ఆత్మ హత్య చేసుకొనే పరిస్థితులు కల్పించేవు. పూరకుక్కని పాతేసినట్లు పాతాలింక. అతనిని దింపండి'' అన్నాడు ఒబీరికా.

మనిషి ఆత్మహత్య చేసుకోడం భూదేవతకు అపచారం. అంటే గ్రామానికే అపచారం. కనక గ్రామస్థులెవ్వరూ ఆ శవాన్ని తాకరు.

ఆత్మహత్య చేసుకున్న వాడి శవాన్ని చెట్టునుంచి దింపడం పరమ నీచంగా భావించ బడుతుంది. ఆ పనికి జిల్లా కమీషనరూ సిద్ధంగా లేడు. కనక అతడు తన సిబ్బందిని తీసుకు పోయేడు.

ఒకోన్‌క్వో శరీరం అల్లా వ్రేలాడు తూనేవుంది.

## చైతన్య చాపం . . . విరియాల లక్ష్మీపతి

క్రాంతిపాప మీంచి ప్రసరించిన సరళరేఖ
ధనుస్సు బంధం నుండి విముక్తశక్తి
నాభ్యంతర్భాగాన్ని పగులకొడితే
ఒక ఆయసం పరిసమాప్తం
ఒకనాటి మంచి ముహూర్తంలో
ఉపనయనపు బ్రహ్మోపదేశం
కర్తవ్యంగా మారిన అతను

మొన్నటి ఉదయాస్తమయాలలో
తీరాలు ముంచిన మంచు వర్షాలు
గాఢంగా పుడమిని
గడాబరించు కున్నపుడు
చీకటి కిటారణ్యపు కొండ గుహల్ని
వానర మిత్రుల్నే ఆశ్రయించాడతను
ఇప్పటికీ అతను నాకు గుర్తే
ముఖరేఖలతో నిమిత్తంలేని భర్తే

అతని పేర్లకేం గాని
అతని వ్రేళ్ళు
నాలోని చైతన్య శక్తికి మూలాలు
కనుకనే వాటి అస్పృత స్పర్శ
నేటికీ గుర్తే
తమోవిచ్ఛేదనా క్రతువుకు
అతను జగత్కర్తే . . .
ఆ యజ్ఞాన్ని భగ్నం చేయదలచిన
రక్కసులు మారీచ కిరాతకులు
నిహతులు కావాలన్న
• అతని సంకల్పం మాత్రం
బ్రహ్మర్షి విశ్వామిత్రుని ఆజ్ఞ

చల్లగా గుండెలపై నిద్రించడం
ఎవరికి మాత్రం వాంఛనీయం కాదు
అజ్ఞానాంధకార తీరాల నుండి
జిగీష ద్వీపాలకు
వారధి నిర్మించక తప్పదు
ప్రళయకాల తాండవ ఢమరుకంతో
నిద్రిత సూర్యుడ్ని
ఈ దెబ్బతో మేల్కొలపక తప్పదు
దిక్కులేక విలపించే దిక్కులు కూడా
రక్తవసనాలు ధరించక తప్పదు

కాల దోషం పట్టినా
అన్యాయంగా బ్రతుకుతోంది
అది న్యాయ శాస్త్రమనే
మురిపం పొందుతోంది
దానికి యాగ మంత్రం
నక్కలపాలైన ఈల పాట
దానికి ఒక ప్రక్క బ్రహ్మచెముడు
రెండో ప్రక్క ఆరణ్యక చిత్తవృత్తి

అవే రక్తపు మరకలు
ఒక జండా మీద గుర్తులు
చీకటి గోశాల తమ్ముల విరియించే
మరుత్తులు
ఇంత సువిశాల ఆవరణంలోనికి
అందర్నీ ఆహ్వానిస్తుంది ఆ జండా
కెంపుల పొద్దుపొడుపు వేడిగాలులు
కేలెత్తి అందించేది మాత్రం
ఒకటే ఒక చైతన్య చాపం.

# తెలుగు సాహిత్యంపై అక్టోబరు విప్లవ ప్రభావం *
(గత సంచిక తరువాయి)

## తుమ్మల వెంకటరామయ్య

ఆంధ్ర దేశంలో సాగిన జమిందారీ వ్యతిరేక రైతు ఉద్యమాలను ఉత్తేజ పరచిన ప్రబోధ గేయాలపై కూడ అక్టోబర్ విప్లవ ప్రభావం వుంది. 1934 ఫిబ్రవరి 22 న వెలువడిన "రైతు భజనావళి" పీఠికలో శ్రీ యన్. జి. రంగా ఇలా అన్నారు:

"ప్రపంచమందొక చోట రైతులు రాజ్యానికి వచ్చినారు. కూలీలు పెత్తనము చేస్తున్నారు. కోటీశ్వరుల కచ్చట తావు లేదు. తినడానికి తిండి, పరుండటానికి పడక యెల్లరికి కరువు లేకున్నవి. ప్రజాసామాన్యమునకు ప్రతిష్ఠలచ్చట లభ్యమగుచున్నవి. ఆంధ్ర ప్రజలు కూడా అలాంటి స్వరాజ్యమునే కాంక్షించు చున్నారు."

"సంఘ శక్తి నెఱింగి జనపదంబుల నెల్ల
రైతు కూటంబు లేర్పరుపవయ్య. . .
సాటి దేశాల కాపుల జాడలరసి
నేడు నీకర్జ మేదియో చూడవయ్య"

అని తుమ్మల సీతారామమూర్తి గారు రాసిన పద్యంలో కూడా ఇదే ధ్వనిస్తూ వుంది.

గేయ వాఙ్మయాన్ని సమీక్షిస్తూ డా॥ గిడుగు వెంకట సీతాపతి "ఆంధ్ర సర్వస్వము"లో ఇలా రాశారు:

". . . . . కర్షకుల కష్టాలు పోవాలనీ, కార్మికుల కష్టాలు పోవాలనీ, ఏ కొద్దిమంది వ్యక్తులకో ధనదాహము తీర్చు ఇప్పటి దౌర్భాగ్యపు ధనధాన్య విభజన పద్ధతి నశించాలనీ, ఉన్నత ఆశయములు ప్రజా హృదయములలో నాటుక పోయినవి."

ఈ సందర్భంగా ఆనాడు వివిధ కవుల గేయాలను ఆయన ఉటంకించారు.

1934 – 35 నాటికి తెనుగు సాహిత్యంలో అక్టోబర్ విప్లవ ప్రభావం వల్ల పెద్ద మార్పు వచ్చింది. ఇది కీలకమైన మలుపు అనవచ్చు.

ఈ వ్యాసకర్త రాసిన "ఎగరాలి ఎగరాలి మన ఎర్రజెండా", వాసిరెడ్డి నాగేశ్వరరావు రాసిన "కూలోడ", పి. లోకనాధం రాసిన "అన్నా కూలీ లేకము కావలెరా !" మొదలైన గేయాలు, శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాలు అక్టోబర్ విప్లవ చైతన్య ప్రతిబింబాలే.

అలాగే అ రోజుల్లో "జ్వాల" పత్రికలో "ముద్దుకృష్ణ" గారి "వ్యత్యాసం" ప్రచురింపబడింది.

---

★ రచనా కాలం 1977 అక్టోబరు

[illegible]
చచ్చు సంఘం – యింక మీదను
మాకు వద్దోయ్"

అని ఆయన సమాజంలోని వ్యత్యాసాలను దుయ్యబడతారు.

## "మహా ప్రస్థానం"

శ్రీరంగం శ్రీనివాసరావు (శ్రీ శ్రీ) "మహాప్రస్థాన" గేయాలు 1933 ద్వితీయార్థంనుండీ ప్రారంభ మయ్యాయి. "మహాప్రస్థాన" గేయం ప్రచురించే నాటికి (12 – 4 – 34) తనకు మార్క్సిజం అంటే ఏమిటో తెలియదని శ్రీ శ్రీ అంటారు. ఐనా,

"మరో ప్రపంచం
మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది. . . . .
"కనబడ లేదా మరో ప్రపంచపు
అగ్ని కిరీటపు ధగధగలు
ఎర్ర బావుటా నిగనిగలు"

అని శ్రీ శ్రీ అన్నప్పుడు ఆ "మరోప్రపంచం" అక్టోబర్ విప్లవంద్వారా జనించిన సోవియట్ దేశమనే పాఠకులు భావించారు.

మహాప్రస్థానంలోని అనేక గేయాలు విప్లవ భావోత్తేజితులైన యువ లోకానికి సమరగీతాలయ్యాయి.

ప్రపంచంలో విప్లవ ప్రాభాత రేఖలు పొడసూపుతున్నాయని 'అవతారంలో' –

"పుడమి తల్లికి
పురుటి నొప్పులు
కొత్త సృష్టిని స్ఫురింపించాయి"

అని శ్రీ శ్రీ అంటారు. "కవితా! ఓకవితా!" లో

"సమ్మె కట్టిన కూలీల
సమ్మె కట్టిన కూలీల భార్యల, బిడ్డల
ఆకటి చీకటి చిచ్చుల
హాహాకారం! ఆర్తారావం !" అని అంటారు

తను వినుతించే నవీన గీతికి ప్రాణమైన "ప్రతిజ్ఞ"లో శ్రీ శ్రీ "తెగించి సమ్మెలు కట్టే వాళ్ల"ను, అనాధలను, అభాగ్యులను, అశాంతులను ప్రస్తావించి, వారంతా "విప్లవ శంఖం వినిపిస్తారోయ్" అంటారు. ఆ విప్లవం అక్టోబర్ విప్లవమే నని చెప్పనక్కరలేదు.

"నిజాలు", "దేశ చరిత్రలు", "వాడు", "మిథ్యావాది", "వ్యత్యాసాలు" మొదలైన గేయాలకు ప్రపంచమూ, సమాజమూ నడిచే తీరును వివమరచి చెప్పిన మార్క్సిస్టు సూత్రాల, విప్లవ చరిత్రల ప్రభావమే కారణం.

నాజీ జర్మనీ సోవియట్ యూనియన్‌పై దాడి చేయగా, సోవియట్

వైమానిక దళాలు తిరుగుదాడి చేసినప్పుడు "లేలే రష్యా రారా రష్యా" అనే ఉత్తే జకరమైన గేయం రచించారు శ్రీశ్రీ. అందులో అక్టోబర్ విప్లవ ఫలితంగా ప్రాదుర్భ వించిన సోవియట్ యూనియన్ అజేయమనే అచంచల విశ్వాసాన్ని ప్రకటించారు.

గుంటూరు జిల్లానుండి వెలువడిన "కార్మిక సంఘం ప్రచురణలు" కథల పరంపరలో "మాతృహృదయం" అనే కథానికను ఈ వ్యాస రచయిత రాశాడు. 1934 జూలైలో ఇది ప్రచురింపబడింది. ఇది గోర్కీ రాసిన 'అమ్మ' నవలకు అనుకరణం, సంక్షిప్త కథ.

## "అమ్మ"

గోర్కీకి (క్రొవ్విడి లింగరాజు గారి) అనువాదం "అమ్మ" 1934 డిసెం బర్‌లో వెలువడింది. ఈ ప్రచురణతో తెలుగు కథానిక, నవలా రచనలో ఒక మలుపు తిరిగింది. అనేక మంది యువ రచయితలకు ఇది మార్గదర్శకమైంది.

వాస్తవానికి గోర్కీ "అమ్మ" రచనా కాలం అక్టోబర్ విప్లవానికి పూర్వానిదే. ఐనా 1905 లో జరిగిన విప్లవం భూమికగానే ఆ రచన జరిగింది. 1917 విప్ల వానికి 1905 విప్లవం ఒక డ్రెస్ రిహార్సల్ అని లెనిన్ అన్నారు. అందుచేత "అమ్మ" కథా వాతావరణాన్ని అక్టోబర్ విప్లవ వాతావరణం గానే పాఠకు లెంచారు.

సోవియట్ యూనియన్ చుట్టూ పెట్టుబడిదారీ ప్రపంచం అల్లిన "ఇనప తెర"ను చీల్చుతూ, 1938 నవంబరులో వెలువడ్డ "నవశక్తి" రష్యా సంచిక అక్టోబర్ విప్లవ విజయాలను వివరించింది.

"నవ్య యుగాల కోర్కెల చిహ్నమై" "కూలి చేసే, పొలము దున్నే కష్ట జీవుల అదృష్టరూపమై", "లెనిన్ వీరుని, శూరయువకుల చిహ్నమైన" విప్ల వాన్ని కీర్తించే గీతికతో ఆ సంచిక ప్రారంభమైంది. "అజ్ఞానాన్ని నిరం కుశాన్ని జయించి పొందిన ఘన విజయాన్ని" ఎవరూ హరించ లేరంటూ రచయిత ప్రదర్శించిన ప్రగాఢ విశ్వాసం ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో రుజువైంది.

## విప్లవ సారథి లెనిన్

సోవియట్ యూనియన్ పై హిట్లర్ దురాక్రమణకు వ్యతిరేకంగా ఆ దేశ ప్రజలు ప్రదర్శించిన ప్రతిఘటన, శౌర్యం చూసినపుడు, అక్టోబర్ విప్లవరథ సారథి, మహానేత లెనిన్ గురించి తెలుగులో అనేక గేయాలు వచ్చాయి.

శ్రీ శ్రీ "గర్జించు రష్యా" అనే ఉత్తేజ పూరిత గేయమే గాక, మయ కోవ్‌స్కీ 'లెనిన్' కావ్యానువాదం కూడ ప్రారంభించారు. మరెందరో లెనిన్ గురించి కవితలు రాశారు.

తుమ్మల (ఈ వ్యాసకర్త), కె. వి. రమణారెడ్డి, సోమసుందర్, రాంభట్ల, నార్ల చిరంజీవి, కొమర్రాజు వినాయకరావు మొదలైన వారెందరో లెనిన్‌పై కవితలు రాశారు. లెనిన్ జీవితాన్ని 'బుర్రకథ' గా సుంకర సత్యనారాయణ

రాశారు. అది విశేష వ్యాప్తి చెందింది.

"నీ నామమె సమ జగతీ
నిర్మాణోత్సవ మాయెను
నీ మాటయె వర్గ రహిత
స్వర్గానికి బాటాయెను"

అని సోమసుందర్ వర్గరహిత సమాజాన్ని స్థాపించిన అక్టోబర్ విప్లవ నాయకుడు లెనిన్‌ను ధృవతారగా ప్రతిష్ఠించారు.

"మహా లెనిన్ ఊహాలోంచి
వికసించిన ఉషస్సు
. . . . దశాబ్దాలుగ అమని
ఇటనే నిల్చి ఉన్నది."

అని రాంభట్ల "నవోషస్సు" లో అక్టోబర్ విప్లవ స్థిరత్వానికి కారకుడైన లెనిన్‌ను ప్రస్తుతించారు.

'అధికారం ప్రజాళిదని
అభయ మిచ్చిన దెవరయా
శాంతి వాణి ఎవరిదయా . . .
రాగల రేపటి స్వప్నం
రగిలించును లెనిన్ కదా"

అని నార్ల చిరంజీవి, "నిజంగా చిరంజీవి లెనిన్" అనే గేయంలో ఈ దేశంలో కూడ అక్టోబర్ విప్లవం "రాగల రేపటి స్వప్నం"గా చిత్రించారు.

తుమ్మల (ఈ వ్యాసకర్త) రచించిన "మా లెనిన్" అనే గేయంలో

"నవంబరేడు నాడు నాటిన అంకురమ్మో దినదిన ప్రవర్ధమై దివ్య మహా వృక్షమై
నవ విప్లవ వీర యోధ శ్రామికాళి సేదదీర్చ ..."

సర్వత్రా చల్లని నీడలను పరుస్తున్నదని అన్నాడు. ఆ విధంగా అక్టోబర్ విప్లవం అనేక జాతీయ, శ్రామిక విప్లవాలకు ఉత్తేజాన్నిచ్చిందన్నారీ కవులు.

ఫాసిస్టు దురాక్రమణ నెదిరించి ప్రపంచాన్ని ఫాసిస్టు కరాళదంష్ట్రల నుండి విముక్తి చేసి అక్టోబర్ విప్లవ విజయాలను పరిరక్షించుకొంటున్న సమయంలో అభ్యుదయ రచయితలు, నయాగరా కవులు సోవియట్ యూనియన్ ఫాసిజాన్ని కూలదోయ గలదనే అకుంఠిత విశ్వాసాన్ని ప్రకటించారు. "ప్రజాశక్తి" కి నివాళులర్పించారు. ఆనాటి సమరగాధలను కీర్తించారు. జానపద రీతిలో ప్రజాకవుల బుర్రకథలు, హరికథలు, వీధిభాగవతాలు, గేయాలు వెలువడ్డాయి. ఇవి అక్టోబర్ విప్లవ లక్ష్యం పట్ల అచంచల విశ్వాసాన్ని ప్రకటించాయి. తెన్నేటి సూరి "అరుణరేఖ" లో

"మానవ స్వాతంత్ర్య
'మాగ్నకార్టా' పైన
రక్తాక్షరములతో

చేశాలు చేశాను.''

అన్నపుడు సోవియట్ విజయాలే మనస్సులో ఉన్నాయని సులభంగా ఊహించవచ్చు.

ఏల్చూరి సుబ్రహ్మణ్యం "ప్రజాశక్తి" లో

"ఎగిరే ఎగిరే ఎర్రటి జెండా
కరకరలాడే కొడవలి పదునూ
లోహం వంచిన సమ్మెట పెట్టూ
విప్లవ్యపు వైతాళికులై
నినదించెను నిప్పుల గొంతుక"
"అదృష్టపు యవనిక లోపల జరిగే విషాద ఘటనల
కంతమ్మే విప్లవమని . . . ." 'ప్రజాశక్తి' చాటిందంటారు.

స్వాతంత్ర్యా నంతరం వచ్చిన యువతరం కవులు కూడ అక్టోబర్ విప్లవ విజయ పతాకమైన "ఎర్ర జెండా"ను తెలుగు కవితలో ప్రతిష్ఠించారు.

"ప్రళయభీకర రూపమెత్తిన
ఫాసిజానికి పాడెగట్టిన
ఎర్రసేన పరాక్రమానికి
ఎత్తి పట్టిన వైజయింతిక
ఎత్తరా మన ఎర్ర జెండా"

అంటారు గజ్జల మల్లా రెడ్డి. ఆయన రాసిన "సోవియట్ల దేశమా" అనే గేయం అక్టోబర్ విప్లవ ఫలితాల పట్ల అచంచల విశ్వాసాన్ని వ్యక్తపరుస్తుంది. ఏటుకూరి ప్రసాద్ రాసిన "విప్లవం"లో ఆనాడు లెనిన్ –

"బూడిద కప్పిన అగ్నికణాలను రగుల్కొల్పినాడు
జూలుపట్టి నిద్రించు సింహముల మేలుకొల్పినాడు . . ,
"జారు, జోరు తగ్గాలి, మీర్ బల్ హుషారు కమ్మన్నాడు
మన దేశం మన మేలుకొందమికి రమ్మని పిలిచాడు"

అనీ, "శ్రామికవీరుల సేద్యంనుండి సోషలిజం పుట్టింద"నీ అక్టోబర్ విప్లవంనుండి ఉత్తేజితు డయ్యాడు. ఈనాటి యువాభ్యుదయ కవులకు అక్టోబర్ విప్లవం పట్ల గల గాఢానురక్తికి ఏటుకూరి ప్రసాద్ రచన ప్రతిబింబం.

అక్టోబర్ విప్లవమూ, ఆ తర్వాత అనేక అగ్ని పరీక్షలకు నిలిచిన సోవియట్ యూనియనూ అందించిన చైతన్యం తెలుగు సాహిత్యంలో ఒక మలుపు తెచ్చింది. చైతన్య యుతమైన సృజనాత్మక శక్తికి దోహదం చేసింది. తెలుగు నాట సాగిన అనేకానేక జాతీయ ఉద్యమాలలో, వర్గ పోరాటాలలో అక్టోబర్ విప్లవ ప్రభావం వేగుచుక్కయై, నవ్య పంథాకు బాట వేసింది. (సంపూర్ణం)

బానిసత్వానికి వ్యతిరేకంగా స్వేచ్ఛ, అన్యాయానికి వ్యతిరేకంగా న్యాయమూ ప్రపంచ చరిత్రలో ఎప్పుడు తిరుగుబాటు జరిగినా; న్యాయమైన తిరుగుబాటు నుండి ఉద్భవించిన తమ పాటలలో ప్రజల తిరుగుబాటు భావం అత్యంత స్పష్టంగా, పెద్దగా ప్రతిబింబించింది. ప్రజల పక్షాన వుండిన ఆ కవులు వాటిని రాశారు. కవులు లేనిచోట, ప్రజలే వాటిని రాశారు.
(జర్మన్ ప్రజాస్వామిక రిపబ్లిక్ కళాకారుడు ఇరిచ్ వైనెర్ట్)

# భక్తవత్సలుడు

**కథానిక**

కవన శర్మ

రాజు బయల్దేరిన అరగంట దాకా చేస్తున్న పనినే సాగదీసి, ఆ పైన దస్త్రం కట్టేసి ఇంటికి బయల్దేరాడు సుబ్బారావు. రాజుతో ఇంటివైపు నడవడం ఇష్టం లేదు సుబ్బారావుకి. అందుకనే రాజును వెళ్లనిచ్చి బయల్దేరాడు. ఇంకా ఆకాశంలో సూర్యుడున్నాడు. అతని కిరణాలు వేడిగా ఉన్నాయి. అవి సుబ్బారావుని తాకుతున్నాయి.. పంచ కొసతో నుదిట పట్టిన చమట తుడుచు కొంటూ నడుస్తున్నాడు సుబ్బారావు. కాస్సేపటికి సూర్యుడు ఎర్రబారి పోతాడు. ఒక రోజు "కర్మసాక్షి రోజంతా జనం చేసిన పాపాలు చూసి చూసి కోపంతో కందగడ్డలా ఎర్రబడి పోయాడు" అన్నాడు సుబ్బారావు రాజుతో.

దానికి రాజు నవ్వి "కామాతురుడైన సూర్యుడు చీకటి పడకుండానే పశ్చిమ దిశాంగన అనే వెలయాలి ఇంటికి పోతూ, ప్రజలు తన దుర్నడతని గమనిస్తున్నారన్న కోపంతో మొహం చెండు కొంటున్నాడు" అన్నాడు.

"నీవన్నీ విపరీత వాదనలే! పశ్చిమ దిశాంగన వెలయాలా? నువ్వు తప్ప ఎవరూ అల్లా అనలేదు!" అన్నాడు సుబ్బారావు కోపంగా.

"సాయింత్రాలు సూర్యుడిని, పొద్దున్న చంద్రుడిని తన ఇంటికి ఆహ్వానించే స్త్రీ వెలయాలు కాదా?" అన్నాడు నవ్వుతూ రాజు.

రాజు సూర్యుడిని, పశ్చిమాన్ని మాత్రమే అంటే సుబ్బారావు బాధ పడకపోవును. రాముడిని, వెంకటేశ్వరుడిని కూడా వేళాకోళం చేస్తూ మట్లాడ్తాడు. అటువంటి వాడితో స్నేహం చెయ్యడం తనకి ప్రమాదం అని మానేసాడు. నిన్నటికి నిన్న టౌను హాల్లో రాముడు దేవుడా? కాదు! అంటూ మైకుపెట్టుకొని ఉపన్యసించాడు. టౌను హాలుకి సుబ్బారావు యిల్లు దగ్గర. ఆ పాపపు మాటలు తన చెవుల బడకుండా రాజు ఉపన్యాసం ఇస్తున్నంతసేపు సుబ్బారావు భజన చేసాడు. ఆంజనేయ దండకం చదివి హనుమంతుడికి కోపం రాకుండా చూసుకొన్నాడు. రాజు ఉపన్యాసం వినడానికి వెళ్లే జనాన్ని చూస్తే సుబ్బారావుకి జాలి. దేవుడు భక్తవత్సలుడే అయినా పాపి భయంకరుడు కదా!

సుబ్బారావు నడుస్తూ రోడ్డు రెండుగా చీలిన చోటికి వచ్చాడు. ఒక రోడ్డు బజారు గుండా తన యింటికి పోతుంది. రెండోది కాలువ పక్కగా తనింటి వైపు పోతుంది. రెండో రోడ్డు మీద రాజు యిల్లుంది. రాజు సుబ్బారావు ఒకే ఆఫీసులో పన్చేస్తూ నువ్వు అని పిలుచు కొనే అంత పరిచయం ఉన్న స్నేహితులు. కాని వయస్సుతో సుబ్బారావు భక్తి వైపు, రాజు నాస్తికత్వం వైపు మొగ్గారు. తమ దార్లు వేరయ్యాయి. ఇద్దరు రెండో వారిని తమ మార్గంలోకి

తిప్పు కొవాలని ప్రయత్నించి విఫలులయ్యారు. ఆ దార్లు చీలిన చోట నిలబడి సుబ్బారావు ఆలోచనలో పడ్డాడు.

సుబ్బారావుకి పెళ్లయి పదిహేను సంవత్సరాలైంది. కొడుకు పుట్టి తొమ్మిది సంవత్సరాలైంది. సరిగ్గా పది సంవత్సరాల క్రితం, సంతానం కోసం ఎన్నో ప్రయత్నాలు చేసి చివరిసారి ఆంజనేయుడికి తమలపాకులతో పూజ చేయించాడు. తరువాత సంవత్సరానికి అంజనేయ ప్రసాద్ పుట్టాడు. అందుకే అంజనేయుడంటే గురి. ఆ దేవుడి కోపం అంటే, భయం.

రాజు, సుబ్బారావుకి పెళ్లియిన అయిదు సంవత్సరాల దాకా పిల్లలు కలగకపోతే డాక్టరుని సంప్రదించమని సలహా ఇచ్చాడు. సుబ్బారావు నష్టమేముందని డాక్టర్ని సంప్రదిస్తే, అతని భార్యకి చిన్న శస్త్ర చికిత్స చెయ్యాలని చెప్పాడు డాక్టరు. సుబ్బారావు భార్య ఆపరేషన్ చేయించుకొంది. తరువాత ఏడాదికి కొడుకుని కంది. ఆ పిల్లాడే అంజనేయ ప్రసాద్.

సుబ్బారావు అంజనేయ స్వామి మహిమని తెగపొగుడుతుంటే రాజు "తనే పిల్లలు కనని దేవుడు నీ చేత కనిపించడమేమిటోయి! నువు, చెల్లాయిని డాక్టరు దగ్గరకు తీసుకు వెళ్లకపోతే, మీ ప్రసాద్ పుట్టేవాడే కాదు. ఆ ఘనత శాస్త్రానిది కాని గుళ్లో విగ్రహానిది కాదు" అన్నాడు.

"దేవుడే నీ చేత నాకా విషయం చెప్పించాడు. ఆ దేవుడే నన్ను ఆ మాట వినేలా చేసాడు. అంతకు ముందు నువ్వు అన్నావా? నేను విన్నానా? ఆ రోజుకి నా భక్తి పరిపక్వమైంది. ఆ డాక్టరే మరొకరికి పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేసాడు. కాని ఏమైంది? ఏడాది తిరక్కుండా పిల్లాడు పుట్టాడు. దేవుడు నిర్ణయిస్తే శాస్త్రం అడ్డు లేదు" సుబ్బారావు కొట్టి పారేసాడు.

సుబ్బారావు ఆలోచనలనుంచి తేరుకొని కాలవ గట్టు వెంబడిపోయే రోడ్డు తీసుకొని రాజింటి మీదుగా పోడానికి నిర్ణయించుకొన్నాడు. ఆరు నెలల క్రితం వరకు అతనూ, రాజూ, రోజూ అటు వేపుగా నడిచేవారు ఆఫీసు వదలగానే. కాని రాజు మరీ నాస్తికత్వం అవలంబించడమే కాకుండా, ప్రచారం చెయ్యటంలోకి దిగాడు. బహిరంగంగా దేవుడితో తలపడటం మొదలు పెట్టాక, సుబ్బారావు వద్దని సలహా యిచ్చి ఫలితం లేక దూరంగా ఉండటం మొదలు పెట్టాడు. ఆరు నెలల నుంచి అతని దారి వేరైంది. ఈ రోజు పాత దారిన పోవాలనుకొన్నాడు. ఎండ వేడిగా ఉండటం, బజారులోకన్నా కాలవ పక్కన చల్లగా ఉండటం ఒక కారణం. కాని అతని మనస్సులో మరో విషయం పట్ల కుతూహలం ఉంది. క్రితం రోజు, రాజు రాముడిని దేవుడు కాదని ఉపన్యసించాడు. భగవంతుడు భక్తవత్సలుడే గాక పాపి భయంకరుడు కదా! దాని ఫలితం రాజు ఈ రోజో మరో రోజో పొందాలి. రాజు ఇంటి మీదుగా పోయి, అతనికి ఏమైనా కీడు జరిగిందేమో తెల్సుకోవాలి. కాని రాజుని అడిగి కాదు. ఆ యింటి వాతావరణం గమనించి తెలుసుకోవాలి.

సుబ్బారావు కాలవ గట్టు పక్కగా నడుస్తున్నాడు. కొంత దూరం పోయేసరికి అక్కడ జనం గుంపుగా నిలబడి ఏదో జరిగినట్టు చెప్పు కొంటున్నారు.

సుబ్బారావు ఆ గుంపులోకి ప్రవేశించి "ఏం జరిగింది ?" అని అడిగాడు.

అందరు తలో మాట చెప్పారు. "నే సెప్తాను బాబుగారికి మీరుండండ హే" అన్నాడు ఓ గిరిజాల యువకుడు. గోచీ మీద నల్ల వల బనియను వేసుకున్నాడు. చేతిలో చేపలు పట్టే గాలం ఉంది.

"అది కాదండయా ! నానేమో ఇక్కడ కూసుని తాపీగా సుట్టముక్క కాల్చుకుంటూ సేపలట్టున్నా నండె. అప్పుడండయ్యా ఓ కుర్రోళ్ల గుంపొచ్చి కాలువలో ఈద్దారి అనుకొంటూ దిగారయ్యా. కుర్రోళ్లు కాస్సేపు బుద్ధిగా ఈతలు కొట్టారయ్యా. ఇంతలో ఇటు కేసో రాదారి పడవ వత్తే దాని ముట్టుకొని రావాలని పందా లేసుకొన్నారయ్యా ! నాను సూత్తు ఉన్నాను. పిల్లోళ్లు సేపల్లా ఈదుకొంటూ పోయారు. సూడ్డానికి మాసర్దాగా అనిపించి గాలం నేలమీద పెట్టి సూత్తున్నాను అంతేనయ్యా – ఇద్దరు చిన్నోళ్లు పడవ కింద కెళ్లి పోయారు. పడవ కలాసులు సూసుకోలేదు. నేను యెంటనే జామ్మని నీటిలో కురికేసి మునక లేత్తున్న కుర్రోళ్ల నిద్దర్ని పైకెత్తి నా నడుం గట్టిగా వాటేసుకోండని సెప్పి ఈదుకొంటూ ఒడ్డుకి సేరా. తమాసా ఏంటంటే అయ్యా, తీరా సూత్తే అందులో ఓ కుర్రోడు అల్లదిగో ఆ డాబా ఇంటి కుర్రోడు. నాను రోజూ సూసేవోడే" అని చెప్తూ రాజు ఇంటికేసి చూపించాడు. రాముడికి భజన చేసిన చోట, రాముడిని దూషించిన చోట ఆంజనేయ ఉంటాడు మరి ! అనుకొన్నాడు సుబ్బారావు.

సుబ్బారావు ఊహించిందే జరిగింది ! దైవదూషణ పాపం అని రాజుకిపాటికి అర్థమై ఉండాలి. తనోసారి రాజుని హెచ్చరించాలి అనుకొంటూ సుబ్బారావు రాజింటికి వెళ్ళాడు. రాజు, చుట్టు పట్ల ఇళ్లవాళ్లతో తన కొడుక్కి జరిగిన ప్రమాదం గురించి మాట్లాడుతున్నాడు. సుబ్బారావును చూసి వీధి గుమ్మం దగ్గరకువచ్చి, "ఇంటికి వెళ్లివచ్చావా సుబ్బారావు ? నన్ను పలకరించి పోదామని వచ్చావా ? రా లోపలికి రా ! నిజమైన స్నేహితుడివి కనుక సానుభూతి చెప్పడానికి వచ్చావు. ఇల్లాంటి పరిస్థితుల్లో. మీ యింటికి రావటానికి నేను తటపటా యిస్తుంటే నువ్వే వచ్చావు ! నీది మంచి మనస్సు. నీ స్థాయికి నేనెదగలేదు !" అన్నాడు రాజు సుబ్బారావు చేతులు పుచ్చుకొని, మనస్ఫూర్తిగా.

సుబ్బారావుకి రాజు మాట్లాడుతున్నది అర్థం కాలేదు. ఇల్లాంటి పరిస్థితుల్లో రాజు మా యింటికి ఎందుకు రావాలనుకొన్నట్టు ? దానికి అతను తపటాయించటం ఎందుకు ? పిల్లాడు జడుసుకొన్నాడా ? ఆంజనేయుడి కుంకుమ కోసమా ? సుబ్బారావుకి అర్థం కాలేదు. కాని తన మనసులో మాట నెమ్మదిగా బయటకు చెప్పాడు.

"నేనింకా ఇంటికి వెళ్లలేదు. వెళ్ళి ఉంటే నిన్న ఆంజనేయుడికి పూజచేసిన కుంకుమ తెచ్చి మీ అబ్బాయి నుదట పెట్టుంవాడిని. మీ అబ్బాయి కాలవలో మునిగి అదృష్టం కొద్దీ బతికి బయట పడ్డట్టు విని వచ్చాను. దేవుడు నీకు అవకాశం ఇచ్చాడు మనస్సు మార్చుకోడానికి. నిప్పుతోను దేవుడి తోను చెలగాటం మంచి కాదు. మనం చాలా అల్పులం. దేవుడిని భక్తితో సేవించుకోవాల్సిన వాళ్లం. ఆ భక్తవత్సలుడి కరుణ కాశపడాల్సిన వాళ్లం. రావణాసురుడంతటి వాడే ఎదురించి నిలవలేక

పోయాడు. గుర్తుంచుకో, నేను వెళ్తాను. నువ్వు మారితే మళ్ళీ వస్తాను"! అని చెప్పి సుబ్బారావు రాజు చెప్తున్నది విని పించు కోకుండా ముందుకు నడిచాడు. భక్తులు, దేవుడిపై విశ్వాసం లేనివారికి, దుష్టులకి దూరంగా ఉండాలి.

సుబ్బారావు ఇంటికి చేరేసరికి భార్య ఎదురు వచ్చి, "జరిగింది విన్నారా? ఎంత ప్రమాదం తప్పి పోయిందో!" అంది ఆమె మాటల్లో చిన్న వణుకు, సన్న ఏడుపు మిళితమై ఉన్నాయి.

"రాజు కొడుకు విషయమేనా! విన్నాను" అన్నాడు సుబ్బారావు

"వాడితో పాటు మన అంజనేయ ప్రసాద్ కూడా ఈతకు వెళ్తాడు" అంది అమె. ఆ వార్త భర్తకు త్వరగా చెప్పి బరువు దించుకొంది

"మన వాడికేం ప్రమాదం జరగ లేదుకదా," అని కంగారుగా అడిగాడు.

"జరిగింది కాని భగవంతుడు రక్షించాడు."

"భగవంతుడు భక్త వత్సలుడు" అన్నాడు సుబ్బారావు తేరుకు

"మన పిల్లవాడికి అసలు ప్రమాద జరగటం ఆశ్చర్యం!" అంది ఆ భక్తుల పిల్లలకి ప్రమాదం జరగ నమ్మశక్యం కాని విషయం అన్న ధోరణిలో. సుబ్బారావు అరక్షణం ఆలోచించాడు. సమాధానం దొరికింది. ఆ "రాజు కొడుకుతో కలిసి ఈతకు వెళ్లినందుకు, ఇనుముతో కూడిన అగ్నికి సమ్మెట పోటులు తప్ప నట్టు మన వాడికి ప్రమాదం జరిగింది కాని ఆ దయామయుడికి మనకి మన స్తాపం కలిగించటం ఇష్టం లేదు అందుకే మన ప్రసాద్ కోసం ఓ మని షిని నీట్లోకి దూకించి రక్షించాడు పూలతో బాటు నార కూడ నెత్తికెక్కినట్టు మన ప్రసాద్‌తో ఈతకు వెళ్లడం అనే సుకృతం వల్ల రాజు కొడుకు కూడా రక్షింప బడ్డాడు" అన్నాడు సుబ్బా రావు దృఢ విశ్వాసంతో.

సుబ్బారావు భార్య సుబ్బారావుతో ఏకీభవించింది. "మన ప్రసాద్‌ని వాళ్లం టికి ఇంక పంపను" అంది.

# అగామి

## తిరునగరి

కార్మికలోకం కలకల నవ్వే
కళ్యాణ ఘడియ రానున్నది
కర్షకుని ఘర్మ జలానికి విలువకట్టే
కమ్మని వేళ రానున్నది

పాపానికి ప్రతిరూపమైన
దోపిడి తొలగనున్నది
ఆకలి పెంచే దుర్మార్గపు
చీకటి అరుగనున్నది .

నేల ప్రతిఅణువునా
నిప్పు ఏదోరూపాన మండుతున్నది
కపటం దట్టంగా వ్యాపించిన
క్రౌర్యాటవి కాలనున్నది

ఈ యుగం మలుపులో
నిలబడ్డ ప్రతి యువకుడూ
ఒక విప్లవచ్చుడు
ప్రతి యువతీ
ఒక ఝాన్సీ
అవిగో !

అన్యాయంపై అధర్మంపై
అసంఖ్యాకంగా ఎత్తిన చేతులు
తిరుగబడ్డ కంఠాలు
ఎరుపెక్కిన నేత్రాలు
కదలుతున్న తండోపతండాలు
వాళ్ళ చేతుల్లో జెండాలు
నేస్తం!
నిస్సందేహంగా రేపటి కాలం

ఇక
నీది నాది - అంటే
శ్రమ జీవిది
సామ్యవాదిది.

దేశంలోని తమకి ఏ శక్తీ లేక పోయినా రాజ్యమేలే శక్తి కొందరికి సమర్పించి తమ పీకలని అర్పించేసిన బీద ప్రజలలా ఉన్నాయి, కసాయివాడి కొట్టు ముందు ఆ మేకలు. మెడలకు తాళ్ళు చిన్న కొయ్యలకి కట్టబడి ఉన్నాయి పారిపోకుండా, రాజ్యాంగం ప్రజలకిచ్చే పౌరసత్వపు హక్కులా.

ఉదయం నించి ఎండలో ఎండేయి. మీదినించి సూర్యకిరణాల వేడికీ, కింద నించి నేల తాపానికీ సోష వచ్చింది వాటికి. రోజంతా ఉపవాసం. ఓ పిడికెడు గడ్డికాని, ఓ గుక్కెడు నీళ్లు కాని కసాయివాడు పెట్టలేదు.

సూర్యుడు దిగిపోయినా వేడి తగ్గలేదు. భూమి వేడికి తట్టుకోలేక నిల్చున్నాయి కొంతసేపు. నీరసానికి తట్టుకోలేక చతికిల పడ్డాయి వెంటనే. తలలు వేలవేసేయి.

రెండు వరసల్లో ఓ పాతిక మేకలున్నాయి. కొన్ని అరుస్తున్నాయి. కొన్ని కళ్లు మూసుకున్నాయి. అవి నిరంతరం నిరంకుశుల దురంతరాల గురయ్యే సామాన్య మానవుడిలా ఏమీ చెయ్యలేక దేవుణ్ణి ధ్యానిస్తూ ఉండొచ్చు. గాఢ సమాధిలోకి వెళ్లిపోయి ఉండొచ్చు. ఊహలనీ ఆలోచనలనీ మనస్సులోంచి తీసి పారేసి, మనస్సుని ఆలోచనా రహితంగా చేసుకోడమే కదా సమాధంటే? ఆత్మ సాక్షాత్కారం చేసుకోడమంటే అదేనట. కాని ఎంత ప్రయత్నించినా మనిషి కది సాధ్యం కాదు. మేకల కది సాధ్యం అయింది. అవి అన్ని ఆలోచనలనీ పక్కకి తోసి పారేసేయి.

అ మేకలికి ఆలోచనలే ఉంటే, ఎదురుగా నున్న అంగడిలో తన అన్నదమ్ములని, అక్క చెల్లెళ్లని చంపి, చర్మం ఊడదీసి, కళేబరాలని వ్రేలా

కథానిక

# మేకలు క్షమించేయా?

## మంథా వెంకట రమణారావు

డ దీసి, వాటి మాంసాన్ని ముక్కలుగా కొట్టి, తూకం వేసి వండుక తినేందుకు అమ్మే మానవుల మధ్య జరిగే మాంసం బేరం చూసి, గమనించి, అర్థంచేసు కొని ఎంత తల్లడిల్లేవో! కన్నీరు కార్చి ఉండేవి, లబోదిబోమని ఏడ్చి ఉండేవి. సంతాప సభలు జరిపి శ్రాద్ధ కర్మలూ అవీ పెట్టి ఉండేవి. చచ్చిపోయి మానవుల కడుపులలోకి వెళ్లి పోయిన బంధువుల ఆత్మశాంతి కోసం దేవుణ్ణి ప్రార్థించి ఉండేవి. కాని అవి ఏమీ చెయ్యడం లేదు.

రుచులనీ, అభిరుచులనీ, ఆకలినీ తీర్చు కుందుకూ, మరి కొందరు లాభాలు గడించేందుకూ, మానవుడు రేపు తెలతెలవారుతుండగానే తనకు విధించ బోయే మరణ దండన గురించి వాటికి తెలీదు.

ఓ మోపెడు ఆకులో, రొడ్డో తమరిని కొయ్యలకి కట్టినవాడు తమకు పడేస్తే బాగుణ్ణు! ఓ కడవడు నీళ్లు పోస్తే బాగుణ్ణు!

హమ్మయ్య! కాస్తంత రొడ్డని రెండు మానవ హస్తాలు తమ ముందు తెచ్చి పడేసేయి! ఒక చిన్న గోలెంలో నీళ్లు ఆ హస్తాలు పోసేయి. బిలబిలా మంటూ పోయి ఆ నీరు తాగేయి. ఆ మానవుని హస్తాలని కృతజ్ఞతతో నాకేయి. అవే హస్తాలు తమ పీకలని ఉత్తరిస్తాయని వాటికి తెలీదు!

రొడ్డ తిని, నెమరు వేస్తూ కూరు చున్నాయి. ప్రాణం కాస్త కుదుట పడింది.

అంగటిలో మేక మాంసం కొనడం అమ్మడం జరిగి పోతోంది.

కిలో ఎంత? పది రూపాయలు ఏమిటీ? అంత ఖరీదా? ఏం చెయ్యడం సార్ రొడ్డ ఖరీదు... మేపుడు ఖరీదులు పెరిగి పోయేయి. మేకలు ఏపుగా ఎద గడం లేదు సార్. మేక మెదడెంత? మెదడు ఒక్కంటికీ ఓ మూడు రూపాయ లివ్వండి. మేక మేధస్సు విలువ మూడు రూపాయలు. వేపుక, మసాలా వేసుక కూర చేసుక తింటే ఎంతో బాగుంటుంది సార్!

* * *

అటువంటి సమయాన మానవ భాషా, మేక భాషా తెలిసిన ఒక ముసలి మేకని, స్వాముల వారి వంటి మేకని తెచ్చి వాటి మధ్య కట్టేడు కసాయి వాడు.

ఆయన మేక భాషలో మేక భాష్యం చెప్పనారంభించేడు.

"తోటి మేకలారా!! సృష్టిలోని అన్ని జీవులలోకీ అతి ఉత్కృష్టమయిన జీవులం! మన మేధస్సుకున్న విలువ మరే మేధస్సుకీ లేదు! మన మేధస్సు, మనం ఎంత ఉన్నతులం అంటే మన కేనాడూ దురాలోచనలు రావు! మనం దేవుడి ముద్దు బిడ్డలం! శాకాహారులం! ఏ ఒక జీవినీ హింసించి ఎరుగం. అన్య జీవులని హింసించే ఆయుధాలు మనం కని పెట్టలేదు. యంత్రాలని కనిపెట్టి ప్రకృతినీ, తక్కిన జీవులనీ మనిషిలా మనం స్వార్థం కోసం ఉపయోగించు కోవడం లేదు. ఓసారన్నా అసత్యం మనం పలకలేదు. మేకల్ని మేకలం

హింసించుకోలేదు. ఒకరి ఆస్తి కోసం ఆశించలేదు మనం. పెడితే తింటున్నాం. లేనప్పుడు పస్తులుంటున్నాం. మరణిం చేక కూడా మన శరీరాలు నిరుపయోగం కావు. మన మాంసాన్ని ఎంతో ఆనం దంగా తింటాడు మనిషి. మన చర్మం చెప్పులకి ఉపయోగ పడుతుంది మనిషికి. ఎముకలు భూసారంగా వారికి పనికొస్తున్నాయి. పరోపకారం మన లక్ష్యం. మన పాలు తాగి నందు వల్లే వారి అహింసా నాయకుడు అహింసే మార్గంగా అవలంబించి దాస్యం నించి వారిని విముక్తులను చెయ్యగలిగేడు! కాబట్టి మనం దేవుడి దగ్గరకు వెళ్ళిపోతాం!

"జన్మలన్నింటిలోకీ నికృష్ట మయి నది మానవ జన్మ! మనిషి అబద్ధా లాడందీ బతకలేడు. తక్కువ జీవులని చంపి కాల్చుక తినందీ బతక లేడు. దొంగతనం అతడి వృత్తి. అన్యుల మీద ఆధారపడందీ మనిషికి ఉనికి లేదు. మనం ఏమంటాం? "మానవ సేవే మాధవ సేవ" అని. "మేకల సేవే మాధవ సేవ" అని మనం అనం. కాని మనిషి తన సేవే అనగా మానవ సేవే మాధవ సేవ అంటాడు! తన జాతిని తనే హింసించే స్థితిలో ఇంకా కూరుక పోయి ఉన్నాడన్న మాట!

"కాబట్టి దేవుణ్ని ధ్యానం చేసి నిద్రపోండి! రేపు ఉదయమే దేవుణ్ని చేరుకుంటాం!" అంటూ మేకల స్వామీ ఉపదేశించాడు మేకల భాషలో.

మర్నాడు కసాయివాడు మేకలని ఒక రాతి దగ్గరకు తీసుక పోయి పీకలు నరికేడు.

పీకలు ఎగిరిపోతూ ఉన్నా మేకలు ఎదురు. . తిరగలేదు. నిశ్శబ్దంగా ప్రాణాలు అర్పించేయి, కసాయి వాడి లాభం కోసం!

ఆఖరికి మేక స్వామి వంతు రాగా ఒక్కసారి కళ్లు మూసుకొని: "దేవుడా! మనిషిని క్షమించు! వీడు కసాయి వాడు! అజ్ఞాని – అపశుప్రాయుడు! అతడికి తెలీదు అతడేం చేస్తున్నదీ!" అని తల ముందుకు వంచేడు మేక స్వామి, కత్తి వేటు కోసం!

## నిదుర లేచిన నిప్పు

కలచవీడు మురళీధర్

వేకువలో తొంగిచూస్తూ
చీకటి వొళ్లు తడుముకుంది
వేసవిలో నిదుర లేస్తూ
నిప్పు కళ్లు నులుముకుంది.

తడుము కొన్న చీకటికి
వొళ్లంతా వేకువలే.
నులుము కొన్న కళ్లల్లో
నిలువెల్లా అగ్నిగోళాలే.

మత్తు వదిలింది.
మగత వదిలింది.
మంచును దట్టించి నమరతుపాకి
మ్రోగింది ఫిరంగిలా.
మ్రోగింది ఫిరంగిలా.
మూగవడ్డ గగనంలో.

మ్రోగింది ఫిరంగిలా
మూల్గుతున్న జగంలో.

## రాజకీయ చలన చిత్రం

(12 వుట మిగతా)

గ్రహణం: కె. కె. మహాజన్. సంగీతం: ఆనంద శంకర్. నటవర్గం: ధృతిమాన్ ఛటర్జీ, సిమి, బిజోన్ భట్టాచార్య; నిర్మాత-దర్శకుడు: మృణాల్ సెన్.

ప్రదర్శనానంతరం జరిగిన ఇష్టాగోష్టిలో తన చిత్రాన్ని గురించి ముచ్చటిస్తూ "ఆ రోజుల్లో వుద్యమంలో పాల్గొన్న ఒక యువకునితో నేను మాట్లాడడం జరిగింది. పార్టీలో వున్నంత కాలం నాయకులు తమని వర్గ పోరాటాన్ని గురించిన పుస్తకాలు చదవ నిచ్చేవారు కాదని, వర్గద్వేషాన్ని పెంపొందించడానికి బదులు వర్గ హింసని గురించే ఎక్కువగా బోధించే వారని చెప్పాడు ఆ యువకుడు. ఈ చిత్రం చూసి అజ్ఞాత వాసంలో వున్న మరో యువకుడు (ఆ రోజుల్లో)నన్ను రహస్యంగా కలుసుకుని వుద్యమంలో చిక్కుకుపోయిన తన లాంటి యువకుల మానసిక సంక్షోభం, ఈ చిత్రంలో వాస్తవికతతో చిత్రించబడిందంటూ హర్షం వెలిబుచ్చాడు. ఇందులోని కొన్ని ముఖ్యమైన పాత్రలనీ, సంఘటననీ నే నెరుగుదును. కేవలం కల్పితాలు కావు" అన్నారు మృణాల్ సేన్. తదనంతరం ప్రేక్షకుల ప్రశ్నలకు సమాధానాలిచ్చారు.

ప్రశ్న: మీరు కమ్యూనిస్టా ?

జవాబు: మనిషి మనిషిగా బతకాలని కోరటం కమ్యూనిస్టు కావటమే అయితే నేను కమ్యూనిస్టునే.

ప్ర: హీరోకి, అతని కాశ్రయమిచ్చిన యువతికీ గల సంబంధాన్ని కొరియర్ అపార్థం చేసుకున్నట్టు చూపడం కాస్త సినిమాటిక్‌గా వున్నట్టనిపిస్తోంది.

జ: పార్టీ విధానాన్ని శంకించే ఆ యువకుణ్ణి ఎలాగైనా తొలగించాలి. అందుకో కారణం కావాలి - అంతే కాదు. మధ్య తరగతి మనస్తత్వానికి కమ్యూనిస్టు తీవ్రవాదులు సైతం అతీతంగా వుండలేక పోతున్నారు. స్త్రీ పురుష సంబంధాలని కేవలం సెక్సుకి ముడిపెట్టి ఆలోచించే స్వభావాన్ని విస్మరించలేకపోవటంవల్ల కలిగే చిక్కే ఇది.

ప్ర: తండ్రిని కలుసుకుని ఇంట్లోంచి బయటికి వచ్చిన యువకుడ్ని పోలీసులు పట్టుకుని కాల్చేసినట్టు చూపించి వుంటే, ఇంకా సహజంగా వుండేదేమో ?

జ: అలా చేసివుంటే వుద్యమాన్ని నీరుగార్చి నట్లవుతుంది. నేనెప్పుడు ఆశావాదిని.

ప్ర: కాళీపట్నం రామారావు గారి 'చావు' కథని గురించి విన్నారా? ఎందుకని చిత్రం తియ్యకూడదు ?

జ: విన్నాను. దాని ఇంగ్లీషు అనువాదం కావాలని కూడా అడిగాను. నా చేత సినిమా తీయించాలనుకునే వాళ్ళు ముందు ఓ సంగతి తెలుసుకుంటే మంచిది. (నవ్వుతూ) నా సినిమాలు ప్రదర్శించటానికి మీకు థియేటర్లు దొరకటం చాలా కష్టం.

ప్ర: 'మృగయా' చిత్ర నిర్మాతలు తెలుగువారే కాబట్టి 'చావు' కథని చిత్రంగా తియ్యడానికి ఆసక్తి కనబరుస్తారనుకుంటాను.

జ: ఏదీ మళ్ళీ వాళ్ళు నా దగ్గరకు రాందే (నవ్వుతూ).

## సమీక్ష

### అక్షర శిల్పాలు'

[కవితా సంకలనం-రచయిత: అంట్యాకుల పైడిరాజు - వెల : రూ. 2-00 ప్రతులకు : ఎ. పైడిరాజు, లెక్చరర్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్, వాల్తేరు.]

ఒక కళలో అరితేరిన కళాకారుడు, యింకో కళలో ప్రవేశిస్తే, కొన్ని సదుపాయాలున్నట్టుగానే, కొన్ని చిక్కులూ తటస్థిస్తాయి మూడు దశాబ్దాలు చిత్రకారుడుగా దేశంలోనూ, ఖండాంతరాలలోనూ పేరు కెక్కిన శ్రీ అంట్యాకుల పైడిరాజు చెక్కిన 'అక్షర శిల్పాలు' అన్న యీ కవితా ఖండాల సంపుటం యిందుకు నిదర్శనం.

ఒకనాటి అర్ధరాత్రి వేళ నిద్రపట్టక, కాఫీ కాచుకోడానికి పూనుకొని, సలసల మరిగే డికాక్షన్‌ను పొయ్యిమీంచి దింపటానికి, వెతికితే దొరకని మసిపాత ప్రేరణ అయ్యింది, చిత్రంగా యీ చిత్రకారుడు కవి అవడానికి. ('మసిపాత' అన్న గీతమొకటి యీ సంపుటంలో వుంది.) ఒకప్పుడు బాగా బతికిన మసి పాత స్వగతం :

''ముఖం చూపలేని ముత్తైదువును
ముఖం పీక్కుపోయిన బిచ్చగత్తెను
అమ్మలారా! అయ్యలారా!
నాపై ఎందుకింత కక్ష ?
నాలో జీవం తగ్గిందనా ?
నాలో రూపం మారిందనా ?
అవసరం అయినప్పుడు యిల్లంతా
గాలిస్తారు
అదునుతీరగానే విసిరి పారేస్తారు''

అయితే శ్రీ పైడిరాజు చిత్రాలలాగా యీ గీతాలు సర్వాంగ సుందరాలు కావు. కొన్ని చోట్ల కవితా విహారం పక్కగా సాగడమూ, లోకవృత్త నిశిత పరిశీలనమూ వున్నా, అనేక చోట్ల వాటిలోని సంగతులు ఒకదాని కొకటి అతక్కండా వున్నాయి. కుంచెతో చూపడంలో వున్న నేర్పు స్థాయికి కలంతో చెప్పే నేర్పు ఎదిగినప్పుడు యీ మంచి చిత్రకారుడు మంచి కవి అవుతాడు. మనసులో మెదిలే దానికి మాటలలో చెప్పడం పలుసార్లు సరిగా కుదరలేదు. చదివేటప్పుడు అన్వయాలు కుదరకా, అర్థాలు తోచకా పాఠకుడు యిబ్బందిపడడం జరుగుతుంది. కాని అందని దానిని దేనినో అందుకోడానికి తపనా, తాపత్రయమూ అంతటా కనిపిస్తాయి; అంతర్మథనమూ వుంది. మచ్చుకు :

''పాముకి పాలుపోసి పెంచినా
కాటు బుద్ధి పోనిచ్చుకోదు
పశువుకి గడ్డిపెట్టి పెంచినా
అడ్డెడు పాలు ఒబ్బిడ్డిగా యిస్తుంది.''

''నిశిరాత్రి విషాదంలో
నిషాలోన రసికత్వం
మనసులేని మమతలేని
మనుగడలో పోరాటం.''

---

### కథా పఠనం

పై విషయంపైని నవంబరు 5న జరగవలసిన సమావేశం భారీ వర్షాల వల్ల జరగలేదు. డిసెంబరు 3 (ఆదివారం) నాడు సాయంత్రం 6 గంటలకు పొట్టి శ్రీరాములు స్మారక మందిరంలో అదే విషయం పైని సమావేశం జరుగుతుంది.

విషయం : అక్టోబరు 'అభ్యుదయ' లో 'రచయితలకు ముడి సరుకు' అన్న శీర్షికలో 58 వ పుటలోని భూమి తగాదా సమస్య.

Edited and Published by [illegible] Venkataramiah, at 15, Arulammal Street, [illegible] 600 017 and Printed at Sree Seva Mandir Press, [illegible]